ప్రథమ ముద్రణము 1951

"భరతం తం నమస్కృత్య
ఆనందాభినవే తథా
మాం దేవీ మనుసంధాయ
సారః సంభావ్యతాంబుధైః"

శ్రీ కైలాస ముద్రణాలయము
గుంటూరు

# ఉ ప హా ర ః

శ్రీమాన్ ఆనందవర్ధనః సహృదయః కారికావృత్తిలక్ష్యాత్మకం ధ్వన్యాలోకం ప్రణినాయ యస్య తు వ్యాఖ్యానం అభినవగుప్తరచితం లోచనమితి ప్రసిద్ధం సాహితీపరమార్థప్రదర్శకం సాహిత్యారాధకైః సర్వైరపి సమాద్రియతే. సలోచనధ్వన్యాలోకాధ్యయనాదేవ సాహితీరంగప్రవేశార్హతేతి సహృదయభాషా. అతఏవ బహోః కాలాత్తదధ్యయనం పరంపరాప్రాప్తం పరమద్య కతిపయసాహిత్యతపస్వినః సారార్థప్రణయినః పరితః పరిదృశ్యంతే ఇతి ధ్వనిసారః ఉపహారీకృతః,

సాహిత్య శాస్త్రీయ గ్రంథావగాహనసిద్ధయే సాహితీసారావళీ ప్రకాశ్యమానా సైషా సాహితీం ప్రవివిక్షూణాముపకారాయ ప్రకల్పతాం. విజయనగరే విద్యాగ్రహణసమయ ఏవ సముదితస్య భావస్య అయమీదృశ ఆకారస్సిద్ధః. తెనాలి సంస్కృతకళాశాలాయాం ఉపాధ్యక్షతామధ్యక్షతాంచ నిర్వాహయతో మమ సాహిత్యాధ్యాపనశీలస్య తత్తద్విషయ సారోపన్యసనసంసక్తామాస్థామభినందయంతః సహృదయాః అద్యాపి ప్రత్యక్షాయమాణాః పరిస్ఫురంతి. నెల్లూరు వేదసంస్కృతకళాశాలాయామధ్యాపన సమయే కృతబుద్ధీనామాంధ్రరసికాణాం "స్వాగవీ పరివర్తనం సహైవాస్తు" ఇతి హార్దం వచః నాద్యాపి శ్రవో జహాతి. అద్య మమేయం కృతిః ధృతాకృతిరేవం సుకృతిసౌకర్యాయ ఆవిష్కృతిం లభతే. ఏవమన్యేపి వక్రోక్తిజీవిత, వ్యక్తివివేక, రసగంగాధరాదయః క్రమేణ ప్రకాశ్యేరన్.

శ్రీ మాధవరామశర్మా "కౌండిన్యః"



# ఉన్మేషము

ఆంధ్రసాహిత్య రచనమునకు కాని, ఆస్వాదనమునకు కాని కవిసహృదయులకు సాహిత్యలక్షణపరిజ్ఞాన మావశ్యకము. ఈ యంశము సకల సారస్వతేయుల హృదయములందు ప్రతిష్ఠితము. తెనుగులో మనకు వలసినన్ని సాహిత్యలక్షణగ్రంథములు లేవు. ఉన్నవైనను సమగ్రములు కావు. నవకాలమున సమగ్రములు కొన్ని ప్రకాశితము లైనవి. తరుణసారస్వతేయులు సమస్తగ్రంథముల సారాంశము నవధరించుటకు సముత్సుకులైయున్నారు. వారి అట్టివారి వికాసమునకు ఇట్టి రచనలావశ్యకములని యనుభవమును స్పష్టము చేసినది. సంస్కృతగ్రంథముల సారార్థమునకు తగిన తెనుగు రచన పరిజ్ఞానము ఉదాత్తవివేకమున కొక పథము.

నవ్య సాహిత్య పరిషత్పక్షమున నవరసగంగాధరము ప్రథమభాగము వ్యావహారిక భాషలో రచించి ప్రకటించితిని. అది ఉత్తమ సాహిత్య విమర్శ గ్రంథమని చెన్నరాష్ట్ర ప్రభుత్వపు 'తెలుగుభాషా' సమితి నిశ్చయించి బహూకరించి లౌకికకర్తవ్యమును ప్రదర్శించినది. ఆంధ్రప్రతాపరుద్రీయమును వ్యావహారికరచన నవ్యసాహిత్య పరిషత్ప్రకాశనము. శ్రీచల్లపల్లి ప్రభువు తదావిష్కారకులై దోహద మిచ్చిరి. ఈ రెండును శ్రీరాయప్రోలు సుబ్బారావు సంపాదకులుగా నున్న సాహిత్యశాస్త్రమాలికలో చేరినవి. ఈ ధ్వనిసారము నిట్లు ప్రకటితము చేయుటకు సాహితీసమితి సమ్మతించినది సభాపతి శ్రీశివశంకరస్వామి సమ్మోదము చూపిరి. నేను నేనుగా దీని నీ విధమున ముద్రించితిని. ఇంకను ఇట్టివి ముద్రణము కోరునట్టివి కలవు. ఆటు నిటు చూచుకొని మిగులు వానిని సహృదయపాఠకులకు నివేదింతును.

జమ్ములమడక మాధవరామశర్మ

విజయదశమి



# ప్ర శం సా

## సాహితీసమితి సభాపతిః

## శ్రీ శి వ శం క ర స్వా మీ

విదిత ఏవ సర్వేషాం విదుషాం యదలంకారశాస్త్రగ్రంథానాం బహుత్వేపి ధ్వన్యాలోక ఏవ సలోచనః మకుటాయమానః ప్రసిద్ధ ఇతి. సహృదయానాం సారస్వతేయానాం అవశ్యం పఠనీయోఽయం గ్రంథః ఇత్యత్ర నాస్తి సందేహః. కింతు తదీయా గంభీరతా విస్తరతా చ తద్దురవగాహతాం సూచయతీతి తదపోహితుం ఛాత్రోపయోగాయ చ స ఏష ధ్వనిసారః సుష్ఠు సంగృహీతః. సంగ్రాహకస్తు మాధవరామశర్మా సహృదయపండితవంశోద్భవః సుబ్రహ్మణ్యశాస్త్రిణః (శ్రీవైరాగ్యానంద భారతీ స్వామినః) పుత్రః పండితసకాశాదధీతసకలవిద్యశ్చ. విశేషతో విజయనగర పట్టణే మహామహోపాధ్యాయ, సర్వతంత్రస్వతంత్ర, తాతోపనామక సుబ్బారాయ (సుబ్రహ్మణ్య) శాస్త్రిచరణానాం సన్నిధానే సక్రమం సమగ్రం చ అలంకారశాస్త్రం సమ్యగధీత్య, తెనాలి నెల్లూరు సంస్కృతకళాశాలాధ్యాపకతాం అధిశ్రిత్య బహూనధ్యాపయామాస. సాహిత్యాచార్యేణ మహోపాధ్యాయేన శ్రీమతా శర్మణా స్వదేశగవీం ఆంధ్రీం అనుసృత్య బహవోఽలంకారగ్రంథాః విరచితాః తేపి విశ్వవిద్యాలయేన పాఠ్యతయా నిర్ణీతాః ఆంధ్రే దేశే విద్వల్లోకే జనతాయాం చ ప్రసిద్ధిం గతాః.

సామాన్యతః అలంకారశాస్త్రే అధీతినః పండితాః తదీయశాస్త్రవిషయపరిప్రశ్నావసరే సశిరఃకంపం అకరమపలోక్యైవ కథయంతి. ధ్వనిసారసంగ్రాహకస్తు బహోః కాలాత్ అద్యావధిప్రసృతానాం అలంకారశాస్త్రీయ విషయాణాం నిస్సంశయం ప్రతిపాదనేన మనస్తుష్టిం చ సంపాదయితుం సహృదయహృదయ సంవాదమపి సంసాధయితుం సమర్థ ఇతి స్వానుభవః సాక్షీ. సాహితీసమితి విద్యాసంస్థాయాః ప్రముఖసామితేయః శర్మా ధ్వనిసారప్రకాశనేన సమితేః సహృదయానాం సదస్యానాం ప్రఖ్యామభిఖ్యాం చ ఆపాద్య బహూపకారమాదధాతీతి హార్దం విశ్వసిమి.

సాహితీసమితిః
గుంటూరు
విజయదశమీ

శ్రీ శి వ శం క ర స్వా మీ

# ప్రత్యయము



ధ్వనిసార మొక యభినందనీయమగు కృతి. ధ్వనికారికల సారాంశము తద్వివరణము విశదముగా నిందున్నది. కొన్ని కారికలును యథాతథముగా పాఠకసముల్లేఖమునకై కూర్పుపొందినవి. ఆ యా లక్షణార్థము కొంత కొంతగా హృదయరూఢమగుటకు ప్రసిద్ధములైన రమణీయోదాహరణములు నిరూపితములైనవి. ధ్వన్యాలోకమునందలి వాదజటిలత యిందు లేదు. ఇక ధ్వని తత్త్వ జిజ్ఞాసువులు ధ్వనిసారావలంబనమున తమ లోచనములతో నాలోకము చూడగలరు. అప్పు డభినవలోచనమున ఆనందాలోకావలోకన ప్రీతి యుదయించును. ఆనందవర్ధన ధ్వన్యాలోకమున కిది సంగ్రహము స్ఫుటముగా నిది సంగృహీతమైనది. ఆనందుని ధారావాహికత అకుంఠితమై యిందున్నది శ్రీ శర్మగారు నేర్పుతో సార సంకలనము చేసినారు.

అనువాదానతిరిక్తముగా ధ్వనిసారమున తెనుగు రచన యున్నది. కావ్యభాషాసుందరత కలిగిన తెనుగు రచన రచనాభిలాషుల కవశ్య ముపాదేయము. ఇది యిట్లు తెనుగున ప్రకాశిత మగుట ఆంధ్రసాహిత్యికుల పరిపాకము. ధ్వనిసారము కన్నడము, తమిళము, మహారాష్ట్రము హిందీ బంగాళీ భాషలలో యథాతథముగ ననువాదము పొంది సర్వ భారత భారతీ సమారాధకులకు మోదప్రమోదము లాధానింపగలదు. మాకు సాహితీదేశికులై ధ్వనిపథము ప్రదర్శించి ధ్వనిసారకృతి రూపమున సాహిత్యారాధకుల కందరకు ఉపకృతి నొనరించినారని ఆత్మ ప్రత్యయమున మేమిపుడు సానందముగ చెప్పగలిగితిమి.

కోపల్లి శ్రీరామమూర్తి, యం.ఏ., హిందూ కాలేజి, బందరు.
* ములుకుట్ల రామకృష్ణశాస్త్రి, యం.ఏ., ఏ. సి. కాలేజి, గుంటూరు.



# సూచిక



*

# ధ్వనిసారః

స్వేచ్ఛాకేసరిణః స్వచ్ఛ స్వ చ్ఛాయాయాసితేందవః
త్రాయతాం వో మధురిపోః ప్రపన్నార్తిచ్ఛిదో నఖాః

కావ్యస్యాత్మా ధ్వనిరితి బుధై ర్య స్సమామ్నాతపూర్వః
తస్యాభావం జగదురపరే భాక్తమాహు స్తమన్యే
కేచిద్వాచాం స్థితమవిషయే తత్త్వమూచు స్తదీయం
తేన బ్రూమః సహృదయమనః ప్రీతయే తత్స్వరూపం.

తస్య హి ధ్వనేః స్వరూపం సకలసత్కవి కావ్యోపనిషద్భూతం అతిరమణీయం, రామాయణ మహాభారత ప్రభృతిని లక్ష్యే సర్వత్ర ప్రసిద్ధ వ్యవహారం.

---

# ధ్వనిసారము

కావ్యమున ధ్వని యాత్మ యని కావ్యతత్త్వ మెఱిగిన విద్వాంసు లనిరి. ఆ ధ్వని యనునది లేనే లేదని కొందర రందురు. మరి కొంద రది భక్తి గమ్య మని భక్తిరూప మని యందురు. (భక్తి=లక్షణ) కొందరు ధ్వనితత్త్వము వాగగోచర మనిరి. కావున సహృదయుల మనఃప్రీతికై ధ్వని స్వరూపము నిరూపింతుము. ధ్వన్యభావవాదులు మూడు విధముల నున్నారు.. ధ్వని యనునదియసలు లేనే లేదని మొదటి వాదము. అది యున్నను లక్షణా గతార్థ మగునని రెండవవాదము. ధ్వని యున్నది. అది గతార్థము కాదు. తత్స్వరూపము తెలియ రానిదని మూడవ వాదము. ఈ వాదముల నిరసించి ధ్వని స్వరూపము చెపుట సహృదయ చేతస్సంతోష ముదయించును. ఆ ధ్వని స్వరూపము సకల సత్కవి కావ్యము లందును ఉపనిషద్రూపము. అతిరమణీయము. సంస్కృత వాఙ్మయము నందలి రామాయణము భారతము మొదలగు లక్ష్యము లందంతట ప్రసిద్ధముగా వ్యవహారము కలిగియున్నది.

కావ్యస్య సారరూపతయా స్థితః సహృదయశ్లాఘ్యః యోఽర్థః, తస్య వాచ్యః ప్రతీయమానశ్చేతి ద్వౌ భేదౌ. తత్ర వాచ్యః ప్రసిద్ధః అన్యైః బహుధా వ్యాకృతః. ప్రతీయమానం పునః మహాకవీనాం వాణీషు అస్తి. తత్ సహృదయ హృదయ సుప్రసిద్ధం ప్రసిద్ధేభ్యః అలంకృతేభ్యః వ్యతిరిక్తత్వేన ప్రకాశతే. స హ్యర్థః వాచ్యసామర్థ్యాక్షిప్తం వస్తుమాత్రం అలంకారా రసాదయశ్చ ఇత్యనేక ప్రభేద ప్రభిన్నః, సర్వేషు చ తేషు ప్రకారేషు తస్య వాచ్యాదన్యత్వం యథా;

భ్రమధార్మిక! విస్రబ్ధం స శ్వాద్య మారితస్తేన
గోదానదీ కచ్ఛ కుడుంగ వాసినా దృప్త సింహేన

వాచ్యే విధిరూపే ప్రతీయమానః ప్రతిషేధరూపః. ద్వితీయోఽపి వాచ్యాద్విభిన్నః అగ్రే దర్శయిష్యతే. తృతీయస్తు రసాదిలక్షణః వాచ్యసామర్థ్యాక్షిప్తః న తు సాక్షాచ్ఛబ్ద వ్యాపారవిషయః, విభావాది ప్రతిపాదన ముఖేనైవైషాం ప్రతీతిః. వాచ్యేన సహైవ ప్రతీతిరిత్యగ్రే దర్శయిష్యతే.

---

కావ్యమున సారరూపముగా నుండి సహృదయ శ్లాఘ్యమగు నర్థముండును గదా! ఆ అర్థము వాచ్యమని ప్రతీయమాన మని రెండువిధములు. అందు వాచ్య మనునది ప్రసిద్ధము. అన్యు లనేకు లనేక విధముల వాచ్యార్థమును విస్తరముగా నిరూపించిరి. ప్రతీయమాన మనునది మహాకవుల వాక్కు లందుండును. అది సహృదయ హృదయ సుప్రసిద్ధము. ప్రసిద్ధము లగు నలంకారములకన్న నది యతిరిక్తముగనే ప్రకాశించును. ఆ ప్రతీయమానార్థము వాచ్యార్థ సామర్థ్యమున గోచరించు వస్తురూపము అలంకారము రసాదివిధము నని యనేక ప్రభేద ప్రభిన్నమై యుండును. ఆ సర్వ ప్రకారము లందును ప్రతీయమానము వాచ్యము కన్న నన్యముగనే యుండును. ఉదాహరణము.

“ధార్మిక! విస్రబ్ధముగా సంచరింపుము. గోదావరీ నదీతీరములోని లతా నికుంజమున నివసించు ఆ దృప్తసింహము ఆ శునకమును చంపినదిలే.!”

ఇందు వాచ్యార్థము “సంచరింపుము” అని విధి రూపమున నున్నది. ప్రతీయమానార్థము “సంచరింప వలదు” అని ప్రతిషేధ రూపమున నున్నది. ఇట్లే యలంకారరూపమగు ద్వితీయ భేదమును వాచ్యము కన్న

కావ్యస్య స ఏవార్థః సారభూతః, ఆత్మా. తదర్థవస్తు నిష్యందమానా మహతాం కవీనాం సరస్వతీ ప్రతిభామభివ్యనక్తి యేన కవిసంసారే కాళిదాసాదయః ద్విత్రాః పంచషా వా మహాకవయః గణ్యంతే. స హి ప్రతీయమానార్థః శబ్దార్థశాసన జ్ఞానేన కేవలం నవేద్యతే. కేవలం కావ్యార్థ తత్త్వజ్ఞైః వేద్యతే. తద్వ్యక్తి సమర్థః కశ్చనైవ శబ్దః, తౌ శబ్దార్థౌ మహాకవేః ప్రత్యభిజ్ఞేయౌ. వ్యంగ్య వ్యంజకాభ్యామేవ హి సుప్రయుక్తాభ్యాం మహాకవిత్వలాభో మహాకవీనాం న వాచ్య వాచక రచనా మాత్రేణ. తదర్థాధరః కవిః తదుపాయతయా వాచ్యేర్థే యత్నవాన్ భవతి. వాచ్యార్థ ప్రతీతి పూర్వికా వ్యంగ్యస్య అర్థస్య ప్రతిపత్తిః. వాచ్యార్ద విముఖాత్మనాం సచేతసాం తత్వార్థదర్శిన్యాం బుద్ధౌ సోర్థః ఝుటిత్యేవావభాసతే.

---

విభిన్నమే యని మున్ముందు ప్రదర్శిత మగును. మూడవది యగు రసాద్యర్థము వాచ్య సామర్థ్యాక్షిప్తమె యగును. సాక్షాచ్ఛబ్ద వ్యాపార మునకది విషయము కాదు. విభావాదుల ప్రతిపాదన ముఖముననే యీ రసాదుల ప్రతీతి యుండును. వాచ్యము తోడనే దీని ప్రతీతి యుండుననుట నిక ప్రదర్శింతుము.

ఆ రసార్థమే కావ్యమునకు సారభూత మయిన యాత్మ. రస ప్రయోజనక మయిన వస్తువును ప్రసరింప జేయునదై మహనీయ కవుల సరస్వతి ప్రతిభ నభివ్యక్తము చేయును. అందుననే యనంత మయిన యీ కవి సంసారమున కాళిదాసాదులే యిద్దరు ముగ్గురో యయిదారుగురో మహాకవులని పరిగణింపబడుచున్నారు. ఆ ప్రతీయమానార్థము కేవల శబ్దార్థ శాసన జ్ఞానమున దెలియదు. కావ్యార్థ తత్వజ్ఞులు మాత్రమె దాని తెలియ గలరు. ఆ యర్థము నభివ్యక్తము చేయుటలో నొక్కానొక శబ్దమె సమర్థము. ఆ యర్థము ఆ శబ్దము ఈ రెండు మహాకవికి ప్రత్యభిజ్ఞేయములు. వ్యంగ్య వ్యంజకములను చక్కగా ప్రయోగించిననే మహాకవులకు మహాకవిత్వ సిద్ధి కలుగును. వాచ్యవాచక రచనామాత్రమున నది లభింపదు. ప్రతీయమానార్థాదరము కల కవి తదుపాయ మగునని వాచ్యార్థమున యత్నము కలవాడగును. వ్యంగ్యార్థ ప్రతిపత్తి వాచ్యార్థ ప్రతీతి పూర్వకము కదా!. వాచ్యార్థ విముఖు లయిన సచేతస్కుల తత్వార్థమును దర్శింప గల బుద్ధిలో నా యర్థము వెంటనే యవభాసించును.

ఇదమత్ర ధ్వనిలక్షణం.

యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృత స్వార్థౌ
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః

అర్థో గుణీకృతాత్మా, గుణీకృతాభిధేయశ్చ శబ్దో వా యత్రార్థాంతరమభివ్యనక్తి సధ్వనిరితి. వ్యంగ్యప్రాధాన్యే హి ధ్వనిః, న చైతత్సమాసోక్త్యాదిష్వస్తి. చారుత్వోత్కర్ష నిబంధనా హి వాచ్యవ్యంగ్యయోః ప్రాధాన్య వివక్షా. కావ్యవిశేషోంగీ ధ్వనిః. తస్య పునరంగాని అలంకారా గుణా వృత్తయశ్చ. ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః. తే చ శ్రూయమాణేషు వర్ణేషు ధ్వనిరితి వ్యవహరంతి. తన్మతానుసారిభిః సూరిభిః కావ్యతత్త్వార్థదర్శిభిః వాచ్యవాచక సమ్మిశ్రః శబ్దాత్మా కావ్యమితివ్యపదేశ్యః వ్యంజకత్వ సామ్యాద్ధ్వనిరిత్యుక్తః.

---

ఇక నిది ధ్వని లక్షణము.

"ఏదేని స్థలమున నర్థ ముపసర్జనీకృత స్వ స్వరూపమై యా వ్యంగ్యార్థము నభివ్యంజనము చేసినను, శబ్ద ముపసర్జనీకృతార్థమై యా వ్యంగ్యార్థము నభివ్యంజనము చేసినను ఆ కావ్యవిశేషము "ధ్వని" యని సూరివరేణ్యు లనిరి."

అర్థము గుణీకృతాత్మయయి, శబ్దమును గుణీకృతాభిధేయమై యర్థాంతరము నభివ్యక్తము చేసినచో ధ్వని యని భావము. వ్యంగ్య ప్రాధాన్య మున్ననే ధ్వనియగును. ఈ వ్యంగ్య ప్రధానత సమాసోక్త్యాద్యలంకార ములందు లేదు. వాచ్యవ్యంగ్యము లందలి ప్రాధాన్య వివక్ష చారుతా సముత్కర్ష నాధారము చేసికొని యుండును. కావ్యవిశేష మంగి, యది ధ్వని. అలంకారములు గుణములు వృత్తులును ధ్వని కంగములు. శబ్ద బ్రహ్మానుసంధానము చేయు వైయాకరణులు ప్రథమ విద్వాంసులు. శబ్దములు వినబడగా నవి స్ఫోటను దెలియ జేయునవి యగుటచే "ధ్వని" యని వ్యవహరించు చున్నారు. తన్మతానుసారులు విద్వాంసులు కావ్య తత్త్వార్థమును దర్శించువారు వ్యంజకత్వము సమాన మగుట వాచ్యము, వాచకము, వ్యంగ్యము, వ్యంజనావ్యాపారము కావ్యము "ధ్వని" యని యనిరి ఇట్టి యుపపత్తుల బట్టి ధ్వని యున్న దన వలయును. అది లే దనుట యుక్తము కాదు.

అస్తిధ్వనిః స చాసావివక్షితవాచ్యః వివక్షితాన్యపర వాచ్యశ్చేతి ద్వివిధః సామాన్యేన,
ఆద్యస్యోదాహరణం

సువర్ణపుష్పాం పృథివీం చిన్వంతి పురుషాః త్రయః
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుం.

ద్వితీయస్య

శిఖరిణి క్వ ను నామ కియచ్చిరం కిమభిధానమసావకరోత్తపః
తరుణి! యేన తవాధర పాటలం దశతి బింబఫలం శుకశాబకః.

రూపభేదాదయం ధ్వనిః భక్త్యా నైకత్వం బిభర్తి. అతివ్యాప్తే రవ్యాప్తేశ్చ భక్త్యా నాసౌ లక్ష్యతే. ధ్వని వ్యతిరిక్తేపి విషయే భక్తేః

---

ధ్వని యన్నది కలదు. ఆ ధ్వని యవివక్షిత వాచ్య మని వివక్షితా న్యపర వాచ్య మని సామాన్యముగా ద్వివిధము. మొదటిదాని యుదా హరణము.

"శూరుడు, విద్యల నేర్చినవాడు, సేవించుట యెఱిగిన వాడు నను ముగ్గురు పురుషులు పృథివిని సువర్ణ పుష్పచయనము చేయు చున్నారు."

ఇందు సువర్ణపుష్ప చయన మన్నది యవివక్షిత వాచ్యము. పృథి విలో వారు మువ్వురు సుఖజీవన మొనరింపగలరని భావము. ఇక ద్వితీయ మున కుదాహరణము.

తరుణీ! శుకశాబకము నీ యధరమువలె పాటల మయిన బింబఫల మాస్వాదించు చున్నదే! అది యే శిఖరిపై, యెంత చిరకాలము, ఏ పేరు గల తప మొనరించినదో!

ఇందలి వాచ్యము వివక్షితము నన్యపరము నగుచున్నది. ఇంతటి తప మొనరించినను అధరపాటల బింబమె లభించినది గాని యసలు లభింప లేదు. దానికై యిక నెంత యపేక్షితమో? యని భావము.

రూపభేద మున్నందున నీ ధ్వనికి భక్తితో (లక్షణ) నేకత్వము రాదు. అతివ్యాప్తి యవ్యాప్తి యున్నందున భక్తిచే నిది లక్షితమును గాదు. ధ్వని వ్యతిరిక్త మగు విషయము నందును లక్షణ సంభవించును. వ్యంజకత్వ కృతమయిన సౌష్ఠవము లేని స్థలము నందును కవు లుపచరిత శబ్దవృత్తిలో (లక్షణ) వ్యవహరించుట యుండనే యున్నది. ఇట్టి దెన్నడును ధ్వని

సంభవః వ్యఙ్గ్యకృత సౌష్ఠవరహిత స్థలేపి కవీనాముపచరిత శబ్దవృత్త్యా వ్యవహారో దృశ్యతే. న చైవంవిధః కదాచిదపి ధ్వనేర్విషయోభిమతః. స్వవిషయాదన్యత్ర రూఢాః లావణ్యాద్యాః శబ్దాః ధ్వనేః పదం న భవంతి. అన్యో ధ్వనిః అన్యా గుణవృత్తిః అన్యతమస్య ధ్వనిభేదస్య భక్తిరుపలక్షణం స్యాదపి. న తావతా ధ్వనిహానిః.

యేపి ధ్వనేరాత్మానమనాఖ్యేయమేవామ్నాసిషుః తే న పరీక్ష్యవాదినః యది పునర్ధ్వనేరతిశయోక్త్యానయా కావ్యాంతరాతిశాయి తైః స్వరూపమాఖ్యాయతే తత్తేపి యుక్తాభిధాయినః

ఇతి ప్రథమః

---

విషయ మగు ననుట యభిమతము కాదు. "లావణ్యము" మొదలగు పదములు స్వవిషయము కన్న నన్యార్థమున రూఢములై యున్నవి. అవి ధ్వని స్థానము కావు. ధ్వని యన్యము. గుణవృత్తి (లక్షణ) యన్యము. భక్తి యేదేని ధ్వని భేదమున కుపలక్షణము కావచ్చును. అంత మాత్రమున ధ్వని హానిలేదు, కాగా ధ్వని భాక్తమనుట యనుపపన్నము.

ధ్వని యాత్మ యనాఖ్యేయ మని యనిన వారును లెస్సగా విమర్శించి పలికిన వారు కాదు. ఇది యొక్క యతిశయోక్తిగా ధ్వనిస్వరూపము కావ్యాంతరాతిశయిత మని వా రనుటయేని వారును యుక్తము పలికిన వారలె యగుదురు. ఇట్లు మూడవవాదమును నిరస్తమయినది.

ప్రథమోద్ద్యోతము.

# ధ్వ ని సా రః

## ద్వి తీ యః

ఏవం ధ్వనిః ద్విప్రకారః ప్రకాశితః, తత్ర అవివక్షితవాచ్యస్య ధ్వనేః వాచ్యం ద్విధా మతం. అర్థాంతర సంక్రమితం అత్యంత తిరస్కృత మితి. ఆద్యం యథా;

తదా జాయంతే గుణాః యదా తే సహృదయైర్గృహ్యంతే
రవి కిరణానుగృహీతాని భవంతి కమలాని కమలాని.

అత్ర ద్వితీయః కమలశబ్దః లక్ష్మీ పాత్రత్వాది ధర్మాంతర పరిణతం సంజ్ఞినమాహ. న సంజ్ఞా మాత్రం. ద్వితీయం యథా; వాల్మీకేః

రవి సంక్రాంత సౌభాగ్యః తుషారావృత మండలః
నిశ్వాసాంధ ఇవాదర్శః చంద్రమా న ప్రకాశతే.

అత్ర అంధశబ్దః విచ్ఛాయత్వానుపయోగిత్వాది ప్రయోజనం వ్యనక్తి.

వివక్షితాన్యపరవాచ్య ధ్వనిః అసంలక్ష్యక్రమః సంలక్ష్యక్రమశ్చేతి ద్విధా. తత్ర

---

ధ్వని యిట్లు రెండు విధము లని ప్రకాశిత మయినది. అం దవివక్షిత వాచ్య ధ్వనికి సంబంధించిన వాచ్యము అర్థాంతర సంక్రమితము అత్యంత తిరస్కృతము నని రెండు విధము లనుట సమ్మతము. ప్రథమోదాహరణము.

"సహృదయులు పరిగ్రహించి నపుడే గుణములు గుణము లగును. రవి కిరణానుగృహీతము లయిననే కమలములు కమలము లగును."

ఇందు రెండవ కమల శబ్దము లక్ష్మీ పాత్రత్వాది ధర్మాంతరమున పరిణత మయిన సంజ్ఞి పదార్థమును చెప్పును. సంజ్ఞామాత్రమును జెప్పుట కాదు. ద్వితీయమున కుదాహరణము. వాల్మీకి పద్యము.

"చంద్రుడు సూర్య సంక్రాంత సౌభాగ్యుడై తుషారావృత మండలుడై నిశ్వాసాంధమగు దర్పణము వలె ప్రకాశించుట లేదు."

ఇం దంధశబ్దము విచ్ఛాయత్వము అనుపయోగిత్వము మొదలగు ప్రయోజనములను వ్యంజనము చేయుచున్నది. అంధ శబ్దార్థ మత్యంతము తిరస్కృతము.

రస భావ తదాభాస తత్ప్రశాంత్యాదిరక్రమః
ధ్వనేరాత్మాఽఙ్గిభావేన భాసమానో వ్యవస్థితః.

రసాదిరర్థః వాచ్యేన సహైవావభాసతే. స చాఙ్గిత్వేనావభాసమానః ధ్వనేరాత్మా. రసవదలంకారాదస్య ధ్వనేః విభక్తో విషయః వాచ్య వాచక చారుత్వ హేతూనాం అలంకారాణాం గుణానాం చ యత్ర రస భావ తదాభాస తత్ప్రశమాది పరత్వం తత్ర కావ్యే ధ్వనిరితి వ్యపదేశః.

ప్రధానేఽన్యత్ర వాక్యార్థే యత్రాంగం తు రసాదయః
కావ్యే తస్మిన్నలంకారో రసాదిరితి మే మతిః

సచ రసాదిలంకారః శుద్ధః సంకీర్ణో వా ఆద్యో యథా
కిం హాస్యేన న మే ప్రయాస్యసి పునః ప్రాప్తశ్చిరాద్దర్శనం
కేయం నిష్కరుణ ప్రవాసరుచితా కేనాసి దూరీకృతః

---

వివక్షితాన్యపర వాచ్యధ్వని యసంలక్ష్య క్రమ మని సంలక్ష్య క్రమ మని రెండు విధములు. అందు రసము, భావము రసాభాస, భావాభాస, భావశాంతి మొదలగునది యక్రమము. (అసంలక్ష్యక్రమము) ఇది యంగిభావమున భాసించునదై ధ్వని యాత్మగా వ్యవస్థిత మగుచున్నది. రసాద్యర్థము వాచ్యార్థముతోడుత భాసించునదిగా నుండును. అది యంగిగా భాసమాన మేని ధ్వని యాత్మ. రసవదలంకారము కన్న నీ ధ్వని విషయము విభక్తము. వాచ్య వాచక చారుత్వ హేతువు లయిన యలంకారములు గుణములును రస, భావ, తదాభాస, తత్ప్రశమాది పరములై యుండునేని యా కావ్యమున 'ధ్వని' యని వ్యపదేశ ముండును.

ఇతర వాక్యార్థము ప్రధానము కాగా రసాదు లంగము లగునేని యా కావ్యమున రసాదిక మలంకారమే యని మా మతి. రసాదికము ప్రధాన మయిననె ధ్వని వ్యవహారము కల్గును. అప్రధానమగుచో రసవదాద్యలంకార వ్యవహారము.

ఈ రసవదాద్యలంకారము శుద్ధముగను సంకీర్ణముగను నుండును. మొదటిదాని కుదాహరణము.

"హాస్య మెందులకు? చిరకాలమునకు నా కంటికి కన్పడి నీ వికవెళ్ళ లేవు. నిష్కరుణ! ఈ ప్రవాసాభిమాన మేమయా? నిన్నెవరిట్లు

స్వప్నాంతేష్వితి తే వదన్ ప్రియతమ వ్యాసక్త కంఠగ్రహః
బుద్ధ్వా రోదితి రిక్తబాహువలయః తారం రిపు స్త్రీజనః,

అత్ర కరుణరసస్య శుద్ధస్య అంగభావాత్స్పష్టమేవ రసవదలంకారత్వం. సంకీర్ణో యథా.

క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోప్యాదదానోంశుకాంతం
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితః సంభ్రమేణ
ఆలింగన్యోవధూతస్త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధః స దహతు దురితం శాంభవో వశ్శరాగ్నిః.

అత్ర త్రిపుర రిపు ప్రభావాతిశయస్య వాక్యార్థత్వే ఈర్ష్యా విప్రలంభస్య శ్లేషసహితస్య అంగభావః. ఇత్యేవంవిధ ఏవ రసవదాద్యలంకారస్య న్యాయ్యో విషయః. రసస్య వాక్యార్థీభావే కథమలంకారత్వం? అలంకారో హి చారుత్వహేతుః ప్రసిద్ధః. న త్వసావాత్మై

---

దూరము చేసిరి? ఈ విధముగా స్వప్నాంతములందు పల్కుచు ప్రియతమ కంఠాలింగనమును భావించి నిద్ర నుండి మేల్కొని, బాహువలయము శూన్యము కాగా నీ రిపుస్త్రీ జనము బిట్టు దుఃఖించు చున్నది.''

ఈ పద్యము నందు ఇతరాలంకారముల సంబంధము లేని శుద్ధమగు కరుణరసము రాజవిషయ రతిభావమునందు అంగభావము పొంది యున్నది. అందుచే రసవదలంకార మగుట స్పష్టము. సంకీర్ణమున కుదాహరణము.

విదిలింపగా హస్తములందు లగ్నమై చెదుర జేయగా నంశుకాంతము పట్టి, తొలగింపగా కేశములు గ్రహించి అపాస్తము చేయగా పాద పతితమై సంభ్రమమున ననాదరముతో చూడక పోగా ఆలింగనము చేసి కొని నిరస్తమై శంకరుని శరాగ్ని ఆర్ద్రాపరాధుడైన కాముకుని వలె సబాష్పనయనలైన త్రిపుర యువతులను కలత పెట్టినది. అది మీ దురితమును దహించు గావుత!

దీనిలో త్రిపురరిపు ప్రభావాతిశయము ప్రధాన వాక్యార్థము. అందు శ్లేషసహిత మైన ఈర్ష్యావిప్రలంభ శృంగారము అంగభావము పొందినది. ఇట్టి విధమున నుండునదే రసవదాద్యలంకారమునకు న్యాయ్య మైన విషయము.

వాత్మనశ్చారుత్వహేతుః. తథా చ రసభావాది తాత్పర్య మాశ్రిత్య అలంకృతీనాం వినివేశనం అలంకారత్వసాధనం. తస్మాదంగత్వేన రసాదీనా మలంకారతా. యః పునరంగీ రసో భావో వా సర్వాకారమలంకార్యః స ధ్వనేరాత్మా. కించ;

తమర్థమవలంబంతే యేఽఙ్గినం తే గుణాః స్మృతాః
అంగాశ్రితా స్త్వలంకారా మంతవ్యాః కటకాదివత్.

యే తమర్థం రసాదిలక్షణమంగినం అవలంబంతే తే గుణాః శౌర్యాదివత్, వాచ్య వాచక లక్షణాన్యంగాని యే పునరాశ్రితాస్తేలంకారాః కటకాదివత్

శృంగారః రసాంతరాపేక్షయా మధురో రసః. తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యలక్షణో గుణః ప్రతితిష్ఠతి. విప్రలంభశృంగారే కరుణే మాధుర్యం ప్రకర్షవత్. యతః తత్ర మనః అధికం ఆర్ద్రతాం యాతి.

---

రసము వాక్యార్థీభావము పొందియున్నపుడది యలంకార మగునని ప్రాచీను లనిరి. అప్పు డది యలంకారమెట్లగును? అలంకార మనునది చారుత్వ హేతు వని ప్రసిద్ధి గదా! అది తనకు తానే చారుత్వహేతువు గాదు. రసభావాది తాత్పర్యము నాశ్రయించి అలంకారములను కూర్చుట యలంకారత్వ సాధనమైన యుపాయము. కావున అంగముగా నున్నపుడే రసాదుల కలంకారత్వ మున్నది. రసము గాని భావము గాని అంగి యగుచో సర్వాకారమున నది యలంకార్యమే. అది ధ్వని యాత్మ.

ఇంక నీ విషయమును పరిగ్రాహ్యము. అంగిగా నుండు నా రసాద్యర్థము నవలంబించి యుండునవి గుణములు. కటకాదులవలె నంగాశ్రితములగునవి యలంకారము లని మననము చేయవలెను. ఇయ్యవి రసాదిరూపమైన యంగిగా నున్న ఆ ధ్వన్యర్థమునే యవలంబించునవి యగుచో శౌర్యాదుల వలె నవి గుణము లగును. శౌర్యధైర్యాదులు ఆత్మనే యవలంబించి యుండును. వాచ్య వాచక రూపము లైన యంగములను సమాశ్రయించి యుండునవి కటకాదుల వలె నలంకారములు. హార కేయూర కటకాదులు ఆత్మాశ్రయములు కావు. అవి శరీరాశ్రయములు.

శృంగారము రసాంతరముల కన్న మధుర మగు రసము. తన్మయమైన కావ్యము నాశ్రయించి మాధుర్య మన్న గుణము ప్రతిష్ఠిత మగును.

రౌద్రాదయో రసాః పరాం దీప్తిముజ్జ్వలతాం జనయంతి. తదభివ్యక్తి హేతూ శబ్దార్థావాశ్రిత్య ఓజోగుణః వ్యవస్థితః, దీప్తి ప్రకాశన పరః శబ్దః దీర్ఘ సమాస రచనాలంకృతం వాక్యం. అర్థః అనపేక్షిత దీర్ఘ సమాస రచనః ప్రసన్న వాచకాభిధేయః, కావ్యస్య సర్వరసాన్ప్రతి సమర్పకత్వం స ప్రసాదో గుణః శబ్దార్థయోః స్వచ్ఛతా ప్రసాదః. స చ సర్వరససాధారణః సర్వరచనా సాధారణశ్చ. ఏవ మస్మత్పక్ష ఏవ గుణాలంకారవ్యవహారః విభాగేన ఉపపద్యతే.

ఏవం నిత్యానిత్య దోషవిభాగోపి అస్మత్పక్ష ఏవ సంగచ్ఛతే. శ్రుతి దుష్టాదయః అనిత్యా యే దోషాః తే ధ్వన్యాత్మన్యేవ శృంగారే హేయాః, న వాచ్యార్థమాత్రే. న చ శృంగారవ్యతిరేకిణి వ్యంగ్యే, న వా ధ్వనేరనాత్మభావే శృంగారే. అన్యథా తేషామనిత్యదోషతా న స్యాత్.

---

విప్రలంభ శృంగారము నందును, కరుణము నందును, మాధుర్యమునకు ప్రకర్ష యున్నది. అచట మన మధికముగా నార్ద్రత్వము పొందును. రౌద్రాది రసములు సమధిక మగు దీప్తిని అనగా నుజ్జ్వలతను కలుగ జేయును. తదభివ్యక్తి హేతువు లగు శబ్దార్థముల నాశ్రయించి యోజో గుణము వ్యవస్థిత మగును. దీప్తి ప్రకాశన పర మగు శబ్ద మన; దీర్ఘ సమాస రచనాలంకృతమైన వాక్యము. దీప్తిని ప్రకాశింప జేయు నర్థము దీర్ఘ సమాస రచన నపేక్షించదు. ప్రసన్న వాచకములచే నది గోచరించును. కావ్యము సర్వ రసములను సమర్పించునది యగుట ప్రసాద మన్న గుణము.

శబ్దార్థము లందలి స్వచ్ఛతను ప్రసాద మందురు. అది సర్వ రస సాధారణము, సర్వ రచనా సాధారణమును కాగా మా యీ పక్షము నందే గుణాలంకారముల వ్యవహారము విభాగమున నుపపన్న మగును. ప్రాచీన మతము నందది గుదురదు. గుణములు గుణములు కాజాలవు. అలంకారము లలంకారములును కాజాలవు.

నిత్యానిత్యదోషవిభాగమును మా పక్షము నందే సంగత మగును. శ్రుతిదుష్టాదు లనిత్యదోషములని ప్రసిద్ధి. అవి ధ్వన్యాత్మ యైన శృంగారము నందే హేయములు. కేవల వాచ్యార్థమున గాని, శృంగారాతిరిక్త మగు వ్యంగ్యమున కాని, ధ్వని యాత్మగాని శృంగారమున గాని యవి హేయ

అంగితయా వ్యంగ్యోరసాదిర్య ఉక్తః తస్య అంగానాం వాచ్య వాచకానుపాతినాం అలంకారాణాం ప్రభేదా నిరవధయః రసభావ తదాభాస తత్ప్రశమ లక్షణా విభావానుభావ వ్యభిచారి ప్రతిపాదన సహితాః స్వగతా అనంతా విశేషాః తేషామన్యోన్య సంబంధ పరికల్పనే క్రియమాణే అన్యతమస్యాపి రసస్య ప్రకారాః పరిసంఖ్యాతుం న శక్యంతే. కిముత సర్వేషాం. తథా హి; శృంగారస్యాంగినః తావదాద్యౌ ద్వౌ భేదౌ సంభోగో విప్రలంభశ్చ. సంభోగస్య చ పరస్పర ప్రేమదర్శన సురత విహరణాది ప్రకారాః విప్రలంభస్యాపి అభిలాషేర్ష్యావిరహ ప్రవాస విప్రలంభాదయః తేషాం చ ప్రత్యేకం విభావానుభావ వ్యభిచారిణః తేషాం చ దేశ కాలాద్యాశ్రయావస్థాభేదః. ఇతి స్వగతభేదాపేక్షయా ఏకస్య తస్యాపరిమేయత్వం. తథాపి దిఙ్మాత్రముచ్యతే. తేన వ్యుత్పన్నానాం సహృద

ములు కావు. ఇట్లంగీకరింపక పోయినచో వాని కనిత్యదోషత్వమే లేక పోవచ్చును.

అంగిగా వ్యంగ్య మగు రసాదిక మేది కలదో తదంగములు, వాచ్య వాచకముల ననుసరించినవియు నైన యలంకారముల ప్రభేదములు నిరవధికములుగా నున్నవి. రసము, భావము, రసాభాస, భావాభాస, భావశాంతి రూపము లనునవి విభావానుభావ వ్యభిచారి ప్రతిపాదన సహితములై, స్వగత విశేషములే యనంతము లగుచున్నవి. వాని కన్యోన్య సంబంధ పరికల్పన మొనరింపగా ఏదేని యొక రస ప్రకారము లయినను పరిసంఖ్యానము చేయుట శక్యము కాదు. సర్వముల విషయ మిక నేమి చెప్ప నగును. చూడుడు! అంగి యగు శృంగార మునకు సంభోగ మని విప్రలంభ మని రెండు భేదములు కలవు. అందు సంభోగ మునకు పరస్పర ప్రేమదర్శనము సురతము విహరణము మొదలగు ప్రకారములు కలవు. విప్రలంభమునకును అభిలాష, ఈర్ష్య, విరహము, ప్రవాసము మొదలగు భేదములు కలవు. వానికిని ప్రత్యేకముగా విభావానుభావ వ్యభిచారు లున్నవి. వానికిని దేశ కాలాద్యాశ్రయము లయిన యవస్థా భేద ముండును. ఇట్లు స్వగత భేదముల రూపించినను శృంగార మది యపరిమేయమే యగును. అయినను దిఙ్మాత్రము చెప్పెదము. దానిచే వ్యుత్పన్నులయిన సహృదయుల బుద్ధి యంతట ప్రసరించును. అంగియగు శృంగారమున కన్ని ప్రభేదము లందును

యానాం బుద్ధిః సర్వత్రైవ భవిష్యతి. అంగినః శృంగారస్య సర్వేషు ప్రభేదేషు ఏకప్రకారానుబంధితయా ప్రబంధేన ప్రవృత్తః అనుప్రాసః న వ్యంజకః. అంగభూతస్య శృంగారస్య అనుప్రాసనిబంధనే కామచారః ధ్వన్యాత్మభూతే శృంగారే యమకప్రకారాణాం దుష్కరశబ్దభంగశ్లేషాదీనాం నిబంధనం న యుక్తం. కాకతాలీయేన కదాచిత్ కస్యచిత్ ఏకస్య యమకాదేర్నిష్పత్తావపి భూమ్నా అలంకారాంతరవత్ రసాంగత్వేన నిబంధో న కర్తవ్యః, విప్రలంభే సౌకుమార్యాతిశయోస్తీతి తస్మిన్ ద్యోత్యే యమకాదే రంగస్య నిబంధో నియమాన్న కర్తవ్యః, నిష్పత్తౌ ఆశ్చర్యభూతోపి యస్య అలంకారస్య బంధః రసాక్షిప్తతయైవ శక్యక్రియో భవేత్ సః అత్ర ధ్వనౌ అలంకారో మతః తస్యైవ రసాంగత్వం ముఖ్యం, రసాంగత్వే చ తస్య లక్షణం అపృథగ్యత్ననిర్వర్త్యతా. యమకే చ ప్రబంధేన బుద్ధిపూర్వకం క్రియమాణే నియమేనైవ శబ్దవిశేషాన్వేషణరూపః యత్నాంతర ఆపతతి. అలంకారాంతరాణి తు రససమాహితచేతసః ప్రతిభానవతః కవేరహంపూర్వికయా పరాపతంతి. రసాభాసే చాంగత్వమప్యవిరుద్ధం.

---

ఏకప్రకారాను బంధిగా నుండు ప్రబంధ ప్రవృత్తమైన యనుప్రాసము ప్రకాశకము కాజాలదు. అంగభూతమైన శృంగారమున కనుప్రాసము ప్రకాశము కావచ్చును. తన్నిబంధనమున నియమము లేదు. కామచారమే ధ్వన్యాత్మభూత మైన శృంగారమునందు యమక ప్రకారము లైన దుష్కర శబ్దభంగ శ్లేషాదుల నిబంధనము యుక్తము కాదు. కాకతాళీయమున నొకప్పు డేదేని యొక యమక ముచితముగా నిష్పన్న మయినను అలంకారాంతరముల వలె నధికముగా యమకమును రసాంగముగా నిబంధనము చేయరాదు. విప్రలంభమున సౌకుమార్యాతిశయ మున్నది. కావున నది ద్యోత్య మగు నప్పుడు నియమమున నంగముగా నైనను యమకనిబంధన మొనర్ప రాదు. ఒక్కొకప్పుడునిష్పత్తిలో నాశ్చర్యభూత మైనను నలంకారబంధము రసప్రవణమై రసాక్షిప్తముగా నుండునదియై శక్యక్రియ మగునేని యది యిచట ధ్వనిజానలంకార మని సమ్మతము. అట్టిదానికే ముఖ్యమైన రసాంగత్వ ముండును. అపృథగ్యత్న నిర్వర్త్య మగుట యది రసాంగముగా నుండుటలో లక్షణము. బహుళముగా బుద్ధిపూర్వకముగా యమకమును నిబంధించినచో శబ్దవిశేషాన్వేషణ రూపమైన యత్నాం

అలంకారో హి బాహ్యాలంకార సామ్యాదంగినశ్చారుత్వహేతుః, ధ్వన్యాత్మభూతే శృంగారే సమీక్ష్య వినివేశితః రూపకాదిరలంకారవర్గః యథార్థతామేతి ధ్వనేరంగినశ్చారుత్వహేతుర్నిష్పద్యతే.
ఏషాచాస్య వినివేశనే సమీక్షా.

౧ రసాదిపరత్వేన వివక్షా
౨ కదాచిద్రసాదితాత్పర్యేణ వివక్షితస్యాపి అలంకారస్య అంగిత్వేన వివక్షా న కార్యా
3 అవసరే గ్రహణం నానవసరే
౪ గృహీతస్యాపి రసానుగుణాలంకారాంతరాపేక్షయా త్యాగః
౫ అలంకారస్య అతినిర్వహణైషితా న యుక్తా
౬ నిర్వ్యూఢావపిచ యత్నేనాంగత్వే పర్యవేక్షణం

ఏవముపనిబధ్యమానో౽లంకారః రసాభివ్యక్తిహేతుర్భవతి. ఉక్త ప్రకారాతిక్రమే నియమేనైన రసభంగహేతుః సంపద్యతే.

---

తరము కలిగి తీరును. అలంకారాంతరము లట్టివి కావు. రససమాహిత చేతస్కుడు ప్రతిభా సహితుడు నయిన కవికి నహంపూర్వికముగా నవి పరాపతితము లగును. రసాభాసమును ప్రతిపాదించు నపుడు అంగముగా నుంచుట విరుద్ధము గాదు. బాహ్యాలంకార సామ్యమున నలంకార మనునది యంగికి చారుత్వ హేతువు.

ధ్వన్యాత్మభూత మైన శృంగారము నందు సమీక్షించి వినివేశిత మైన రూపకాద్యలంకార వర్గము యథార్థత్వము పొందును. అంగియగు ధ్వనికి చారుత్వ హేతువుగా నిష్పన్న మగును. ఈ చెప్పునది రూపకాద్య లంకారముల వినివేశనము నందు యుక్తమగు సమీక్ష

౧ రసాది పరముగా నలంకార ములను నిబంధింప దలచుట.
౨ ఒకప్పుడు రసాదిపరముగా వివక్షిత మయినను అలంకారము నంగిగా వివక్షించుట తగదు.
3 అవసర సమయమునందే యలంకారములను గ్రహింపవలయును. అనవసరమున గ్రహింపరాదు.
౪ అవసరాపేక్షిత మని యలంకారమును గ్రహించినను రసానుగుణాలంకారాపేక్షతో మొదటి యలంకారమును త్యజించుట యుక్తము

సంలక్ష్యక్రమధ్వనిః

వివక్షితాన్యపరవాచ్యధ్వనిః శబ్దశక్తిమూలః అర్థశక్తిమూలశ్చేతి ద్విప్రకారః. యస్మిన్నాక్షేప్యే శబ్దశక్త్యా అలంకారః ప్రకాశతే స ఏవ శబ్దశక్త్యుద్భవో ధ్వనిః, వస్తుద్వయే చ శబ్దశక్త్యా ప్రకాశమానే శ్లేషః, స చాక్షిప్తోలంకారః యత్ర పునః శబ్దాంతరేణ అభిహితస్వరూపః తత్ర న శబ్దశక్త్యుద్భవానురణన రూప వ్యంగ్య ధ్వని వ్యవహారః. తత్ర వక్రోక్త్యాది వాచ్యాలంకార వ్యవహార ఏవ. యత్ర తు సామర్థ్యాక్షిప్తం సదలంకారాంతరం శబ్దశక్త్యా ప్రకాశతే స సర్వ ఏవ ధ్వనేర్విషయః యథా;

ఉన్నతః ప్రోల్లసద్ధారః కాలాగురు మలీమసః .
పయోధరభరస్తన్వ్యాః కం న చక్రేభిలాషిణం.

అత్ర శబ్దశక్త్యా ప్రకాశమానే సత్యప్రాకరణికే అర్థాంతరే వాక్యస్య అసంబద్ధార్థాభిధాయిత్వం మా ప్రసాంక్షీదితి అప్రాకరణిక ప్రాకరణికయోరుపమానోపమేయ భావః కల్పయితవ్యః. ఏవమన్యేప్యలంకారాః అస్మిన్ధ్వనౌ సంభవంత్యేవ.

---

౫ అలంకారము నత్యంతము నిర్వహింప వలె నన్న భావము యుక్తము కాదు.

౬ అలంకారము నిర్వ్యూఢ మయినను యత్నమున నంగముగా నుండునట్లు పర్యవేక్షింపవలెను.

ఇట్టి సమీక్షాదృష్టితో నలంకారమును నిబంధించుట రసాభివ్యక్తి హేతు వగును. ఈ చెప్పిన సమీక్షా ప్రకారము నతిక్రమించినచో నవశ్యముగా నది రసభంగ హేతువగును.

సంలక్ష్యక్రమధ్వని

వివక్షితాన్యపర వాచ్య ధ్వని శబ్దశక్తి మూలక మర్థశక్తి మూలక మని ద్వివిధము. ఏదేని కావ్యమున శబ్దశక్తిచే నలంకారము ప్రకాశించినచో నదియే శబ్దశక్త్యుద్భవ మగు ధ్వని. వస్తుద్వయము శబ్దశక్తిచే గోచరించినచో నది శ్లేషాలంకారమె కాని ధ్వని కాదు. అట్లాక్షిప్తమగు నలంకారమును మఱల శబ్దాంతరమున నభిహిత స్వరూప మేని యచట శబ్దశక్త్యుద్భవ మయిన యనురణన రూప వ్యంగ్య ధ్వని వ్యవహారము కలుగదు. అచట వక్రోక్తి మొదలగు వాచ్యాలంకారము లన్న వ్యవహారమె కల్గును.

యత్రార్థః స్వసామర్థ్యాదర్థాంతరమభివ్యనక్తి శబ్దవ్యాపారం వినైవ సః అర్థశక్త్యుద్భవో నామ అనుస్వానోపమవ్యంగ్యో ధ్వనిః. యథా;

ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వేపితు రధోముఖీ
లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ.

అత్ర హి లీలాపత్రగణనముపసర్జనీకృత స్వరూపం శబ్దవ్యాపారం వినైవ అర్థాంతరం వ్యభిచారిభావలక్షణం ప్రకాశయతి. న చాయమలక్ష్యక్రమ వ్యంగ్యస్యైవ విషయః. యతః యత్ర సాక్షాచ్ఛబ్దనివేదితేభ్యః విభావానుభావవ్యభిచారిభ్యః రసాదీనాం ప్రతీతిః స తస్య కేవలస్య మార్గః ఇహ తు సామర్థ్యాక్షిప్త వ్యభిచారిముఖేన రసప్రతీతిః. తస్మాదయమన్యః ధ్వనేః ప్రకారః.

---

వాచ్య సామర్థ్యాక్షిప్తమై యలంకారాంతరము శబ్దశక్తిచే నవభాసించు నేని యా సర్వము ధ్వనివిషయ మగును. ఉదా:

“సమున్నతము సముల్లసద్ధారము కాలాగురు మలీమసము నయిన తన్వీ పయోధర భరము ఎవని నభిలాష కల వానిగా జేయదు.”

ఇందు తరుణీ కుచార్థము మొదటిది. కుచ మున్నతము సముల్లసించు హారము కలది. అగురు ద్రవ్యము వలె నీలము నని యన్వయము. నీల మేఘార్థము రెండవది. మేఘ మున్నతము సముల్లసనము పొందు జలధారలు కలది నీలమును. ఇట్టి యప్రాకరణిక మయిన యర్థాంతర మిచట శబ్దశక్తిచే ప్రకాశమానము కాగా ప్రాకరణి కాప్రాకరణి కార్థముల కేదేని సంబంధ మభ్యూహింప వలసి యుండును. ఎట్టి సంబంధము లేకపోయినచో వాక్యమసంబద్ధార్థము నిరూపించిన దగును. అప్పుడు శ్రద్ధేయత యుండదు. ఉన్మత్తాది వాక్యములందు వలె నవిశ్వాసము కలుగును. ఇది కవి వచనమగుట నసంబద్ధార్థాభిధాయిత్వము ప్రసక్తము కారాదు. కావున ప్రాకరణి కాప్రాకరణి కార్థముల కుపమానోపమేయ భావమును కల్పింప వలసి యున్నది. ఇట్లే ఇతరాలంకారములును ఈ ధ్వని యందు సంభవించును.

ఏదేని వాక్యమున నర్థము స్వ సామర్థ్యమున నర్థాంతరమును శబ్ద వ్యాపారములేకనే యభివ్యంజనము చేయునేని యది యర్థశక్త్యుద్భవ మన్న యనుస్వానోపమ వ్యంగ్య ధ్వని. ఉదా.

“ఇట్లు దేవఋషి పలుకగా తండ్రి పార్శ్వమున నధోముఖిగా

శబ్దశక్త్యా అర్థశక్త్యా వా ఆక్షిప్తోపి వ్యంగ్యోర్థః కవినా పునర్యత్ర స్వోక్త్యా ప్రకాశీక్రియతే సః అస్మాద్ధ్వనేరన్య ఏవాలంకారః. శబ్దార్థశక్త్యా యథా;

దృష్ట్యా కేశవ! గోపరాగహృతయా కించిన్న దృష్టం మయా
తేనాత్ర స్ఖలితాస్మి నాథ! పతితాం కిం నామ నాలంబసే?
ఏకస్త్వం విషమేషుఖిన్నమనసాం సర్వాబలానాం గతిః
గోప్యైవం గదితః సలేశమవతాద్గోష్ఠే హరిర్వశ్చిరం.

---

నున్న పార్వతి లీలా కమల పత్రములను లెక్కించెను.''

ఇందు లీలా పత్ర గణన ముపసర్జనీకృత స్వరూపమై శబ్దవ్యాపారము లేకనే వ్యభిచారి భావ రూప మయిన యర్థాంతరమును ప్రకాశింప జేయుచున్నది. ఇట్టి భావ ప్రకాశనము కేవల మసంలక్ష్య క్రమ వ్యంగ్య మునకే విషయ మని లేదు. సాక్షాచ్ఛబ్ద నివేదితము లయిన విభావానుభావ వ్యభిచారుల వలన రసాదుల ప్రతీతి యుండు నేని యదియే కేవల మసంలక్ష్య క్రమ వ్యంగ్య ధ్వని మార్గము. ఇందు పూర్వప్రకరణానుసారముగా సామర్థ్యాక్షిప్త వ్యభిచారి భావ ముఖమున రస ప్రతీతి కలుగు చున్నది. కావున నిది తదన్యమగు ధ్వని ప్రకారము.

శబ్దశక్తిచే గాని యర్థశక్తిచే గాని యాక్షిప్త మయిన వ్యంగ్యార్థ మును కవి స్వోక్తిచే ప్రకాశింప జేయునేని యది యీ ధ్వని కన్న నన్య మగు నలంకారమె. అచట ధ్వని వ్యవహారము కలుగదు. ఉదా:—శబ్దార్థ శక్తి కృతము.

కేశవా! నా దృష్టి గోధూళి హృత మయినది. నే నేమియు మార్గ మున చూడనే లేను. జారితిని ప్రభూ! పడితిని గదా! నన్ను హస్తమున పట్టుకపోతి వేల? ఎగుడు దిగుడులలో భిన్నమానసులైన గమన మొనర్పలేని బాలవృద్ధాంగనాదుల కందరకు నీవే యాలంబనము కదా!'' అని మొదటి యర్థము గోచరించును.

''ఓయి కేశవా! ఓయీ గోపస్వామీ! నా దృష్టి యనురాగాప హృత మయినది. ఇక నాకేమియు కన్పడదు. నేను జారుపాటు పొందితిని. ఖండిత చరిత్ర నయితిని. హృదయనాథా! పతిత్వ (భర్తృభావ)ము నవలంబింప వేమి? నీ వొకడవే యసాధారణ సౌభాగ్యశాలివి. మదన విధుర

అర్థశక్త్యుద్భవ ధ్వనౌ వ్యంజకార్థస్య ద్వౌ ప్రభేదౌ, కవిప్రౌఢోక్తి నిష్పన్నశరీర ఏకః స్వతస్సంభవీ చ ద్వితీయః

సజ్జయతి సురభిమాసః న తావదర్పయతి యువతిజన లక్ష్య ముఖాన్
అభినవ సహకార ముఖాన్ నవపల్లవ పత్రలాననంగస్య శరాన్.

అత్ర వసంతో౽చేతనః అనంగస్య సఖా సజ్జయతి న తావదర్పయతీత్యేవంవిధయా యా వసంతదశా సా మన్మథోన్మాథస్యారంభం క్రమేణ గాఢగాఢీభవిష్యంతం వ్యనక్తి.

స్వతసంభవీ య ఔచిత్యేన బహిరపి సంభావ్యమానసద్భావః, న కేవలం భణితివశేనైవ అభినిష్పన్నశరీరః యథా;

---

మనస్కు లయిన యువతుల కందరకు ఈర్ష్యాకాలుష్యము లేక సేవింప దగిన వాడవు. నీవేగతి. నీవే జీవితరక్షోపాయము." గోపి యిట్లు సలేశముగా కృష్ణు నుద్దేశించి పలికినది. ఆ కృష్ణుడు మిమ్ము రక్షించుగావుత!

అను ద్వితీయార్థమును గోచరించును. "గోపరాగహృత-పతిత-విష మేషుఖిన్న" పదములందు శబ్దశక్తి కలదు. మిగులు వానియం దర్థశక్తి యున్నది. ఈ శక్తిద్వయమున గోచరించిన యర్థాంతరము "సలేశం" అన్న పదమున ప్రత్యుజ్జీవిత మయినది. రాధారమణుడు నిఖిలతరుణీజన గాఢ రాగ గరిమాస్పదు డన్నది తెలియ కున్నచో నర్థాంతరము ప్రతీత మె కాదు. సలేశ పద మిచట కవిస్వోక్తి. వ్యంగ్యార్థము స్వోక్తి ప్రకాశిత మగుట నిది ధ్వని కాదు. వాచ్యమగు శ్లేషాలంకారమె.

అర్థశక్త్యుద్భవ ధ్వనికి వ్యంజక మయిన రెండు ప్రభేదము లున్నవి కవిప్రౌఢోక్తి నిష్పన్న శరీర మగునది యొకటి. స్వతస్సంభవి మరి యొకటి ఉదా:

"యువతి జన లక్ష్యమున కభిముఖములు అభినవ సహకార ప్రముఖ ములు నవపల్లవ పత్ర సహితములు నయిన యనంగ శరములను సురభి మాసము సజ్జితము చేయుచున్నదే కాని యింక నర్పించుట లేదు."

ఇం దచేతన వసంతము మన్మథ మిత్రము శరముల నాయత్తము చేసెనె కాని యింక నిప్పటి కర్పించుట లే దను నీ విధముగా వసంత దశ నిరూపిత మయినది. అది క్రమముగా గాఢ ప్రగాఢము కా నున్న మన్మ థోన్మథనారంభము నభివ్యంజనము చేయును.

శిఖిపింఛ కర్ణపూరా జాయా వ్యాధస్య గర్వీణీ భ్రమతి
ముక్తాఫల రచిత ప్రసాధనానాం మధ్యే సపత్నీనాం.

అత్ర యథా యథా వర్ణనా బహిరపి ప్రత్యక్షాదినావలోక్యతే తథా తథా సౌభాగ్యాతిశయం వ్యాధవధ్వా ద్యోతయతి.

యత్ర అన్యోలంకారః అర్థసామర్థ్యాత్ప్రతీయమానః అవభాసతే సః అర్థశక్త్యుద్భవో నామ అన్యో ధ్వనిః. అలంకారాంతర ప్రతీతావపి వ్యంగ్యప్రతిపాదనౌన్ముఖ్యేన వాచ్యస్య యత్ర చారుత్వం న ప్రకాశతే

---

స్వతస్సంభవి యగునది యౌచిత్యమున జగమున గూడ సంభావ్యమానసద్భావము. కేవలము భణితిఃశమునవే యభినిష్పన్న శరీరము కాదు. ఉదా;

"వ్యాధుని వనిత ముక్తారచితాలంకార లయిన సవతుల మధ్య నెమలిపింఛము కర్ణపూరముగా నుంచి కొని గర్వము కలదై సంచరించు చున్నది."

బహిర్జగమున గూడ ప్రత్యక్షాదికమున గుర్తింప నను వగు నిందలి వర్ణనము వ్యాధవధూ సౌభాగ్యాతిశయమును ద్యోతనము చేయుచున్నది. వ్యాధు డితర నాయికానుభవమున నున్నపుడు మత్తగజ కుంభస్థల భేదన మొనర్చి ముత్యముల దెచ్చి హారము లొనర్చి వారల నందర నలంకరింప గలిగెడి వాడు. ఈమె రాగా నట్లు చేయుటకు శక్తుడు కాలేదు. సమీపమున సంచరించు నెపుడు నెమలి కన్నులే యేరి కర్ణాభరణముగ మాత్రము చేసెడి వాడు. ఆత డట్లగుటలో నీయమ సౌభాగ్యాతిశయము తదనుభూతి హేతువు. కావుననె యా పడుచు గర్వీణి యయినది. నాయకుడు వ్యాధుడా నాయికల సమక్షమున జూచుచుండియు కుంభి కుంభ భేదన మొనరించెను. కుంభి కుంభముల నటు జూచినను నాయికల కుంభి కుంభ సదృశము లేవియు స్మృతి తగుల లేదు. ఈ పడుచు పడతి యొద్ద నున్నప్పుడు గజ కుంభముల జూచగనె "ఇవి ప్రియాకుచముల స్మృతికి దెచ్చినవి. భేదింప నని నిశ్చయించెను. కావుననె యీమెకు ముక్తాఫల రచిత ప్రసాధనములు లేవు. కేవల మీమె శిఖిపింఛ కర్ణపూర. అనితరసులభ మయిన సౌభాగ్యాతిరేక మీ పడుచునకు గలదు. కనుక గర్వీణి. ఇట్టి పద్యమున సౌభాగ్యాతిశయము ద్యోత్యమాన మగును.

నాసౌ ధ్వనేర్మార్గః. యత్ర తు వ్యంగ్యపరత్వేనైవ వాచ్యస్య వ్యవస్థానం తత్ర వ్యంగ్యముఖేన వ్యపదేశో యుక్తః. ఉత్ప్రేక్షా ధ్వనిర్యథా;

చందనాసక్త భుజగ నిశ్వాసానిల మూర్ఛితః
మూర్ఛయత్యేష పథికాన్ మధౌ మలయమారుతః.

అత్ర హి మధౌ మలయమారుతస్య పథిక మూర్ఛాకారిత్వం మన్మథోన్మాదదాయిత్వేనైవ తత్తు చందనాసక్త భుజగ నిశ్వాసానిల మూర్ఛితత్వేన ఉత్ప్రేక్షితమిత్యుత్ప్రేక్షా సాక్షాదనుక్తాపి వాక్యార్థ సామర్థ్యాదనురణన రూపా లక్ష్యతే. ఏవమన్యేప్యలంకారా యథాయోగం యోజనీయాః అలంకారాణాం వ్యంగ్యత్వేపి ప్రాధాన్యవివక్షాయామేవ సత్యాం ధ్వనావంతఃపాతః ఇతరథా తు గుణీభూతవ్యంగ్యత్వం. యేషామలంకారాణాం వాచ్యత్వే శరీరీకరణం న వ్యవస్థితం తే అలంకారాః ధ్వన్యంగతాం గతాః

వాచ్యాలంకారము కన్న నన్యమగు నలంకార మర్థ సామర్థ్యమున ప్రతీయమానమై యవభాసించునేని యది యర్థశక్త్యుద్భవ మయిన వేరొక ధ్వని యగును. అలంకారాంతర ప్రతీతిలో గూడ వాచ్యమునకు వ్యంగ్య ప్రతిపాదనౌన్ముఖ్యమున చారుత్వము ప్రకాశింపదేని యది యీ ధ్వని మార్గము కాదు. వ్యంగ్య పరముగనే వాచ్య మున్నపుడు వ్యంగ్య ముఖమున వ్యపదేశ మొనరించుట యుక్తము. ఉత్ప్రేక్షా ధ్వని ఉదా;

"చందనాసక్తము లయిన భుజగముల నిశ్వాస వాయువులచే మూర్ఛిత మయిన యీ మలయ మారుతము వసంత కాలమున పథికులను మూర్ఛితులను జేయుచున్నది."

వసంతకాలమున మలయ మారుతమునకు పథిక మూర్ఛాకారిత్వ మనునది మన్మథోన్మాద దాయిత్వ ముననె కలుగును. అది చందనాసక్త భుజగ నిశ్వాసానిల మూర్ఛితత్వమున నుత్ప్రేక్షిత మయినది. కాన నిచట నుత్ప్రేక్ష విస్పష్టముగా సాక్షాదుక్తము కాక పోయినను వాక్యార్థ సామర్థ్యమున ననురణన రూపముగా గోచరించును. ఇట్లే యితరాలంకారములనుయథాయోగముగా యోజనము చేయ వలయును.

అలంకారములకు వ్యంగ్యత్వ మున్నను ప్రాధాన్య వివక్ష యున్ననే ధ్వనిలో నంతర్భావము సిద్ధించును. కాకున్న గుణీభూత వ్యంగ్యత్వమె, ఏ యలంకారములకు వాచ్యత్వమున శరీరీకరణము వ్యవస్థితము కాదో యా

పరాం ఛాయాం యాంతి. ధ్వన్యంగతా చ ఉభాభ్యాం ప్రకారాభ్యాం వ్యంజకత్వేన వ్యంగ్యత్వేన చ. తత్ర ఇహ ప్రకరణాత్ వ్యంగ్యత్వేన ఇత్యవగంతవ్యం. అలంకారాణాం ద్వయీ గతిః. కదాచిద్వస్తుమాత్రేణ వ్యజ్యంతే. కదాచిదలంకారేణ. తత్ర వస్తుమాత్రేణ యదా అలంకృతయ వ్యజ్యంతే తదా తాసాం ధ్వన్యంగతా ధ్రువం. కావ్యవృత్తేస్తదాశ్రయాత్ యస్మాత్తత్ర తథావిధ వ్యంగ్యాలంకారపరత్వేనైవ కావ్యం ప్రవృత్తం అలంకారాంతర వ్యంగ్యభావే చారుత్వోత్కర్షతః వ్యంగ్యప్రాధాన్యం యది లక్ష్యతే తదా ధ్వన్యంగతా భవేత్.

ధ్వన్యాభాసః

యత్ర ప్రతీయమానోర్థః ప్రక్లిష్టత్వేన భాసతే వాచ్యస్య అంగతయా వా భాసతే నాసౌ అస్య ధ్వనేర్గోచరః. ప్రతీయమానః స్ఫుటః అస్ఫుటశ్చ తత్ర య ఏవ స్ఫుటః స ఏవ ధ్వనేర్మార్గః. స్ఫుటోపి అభిధేయస్య అంగత్వేన ప్రతీయమానః అస్య ధ్వనేరగోచరః యథా;

---

యలంకారములె ధ్వన్యంగత్వము పొందునేని ఛాయాతిశయము కల వగును. ధ్వన్యంగత్వము మనునది ప్రకారద్వయమున సిద్ధించును. వ్యంజకత్వమున వ్యంగ్యత్వమున నని. అందిచట ప్రకరణము ననుసరించి వ్యంగ్య మగుటచే ధ్వన్యంగత సిద్ధించిన దని తెలియ వలెను.

అలంకారములకు గతిద్వయము గలదు. ఒకప్పు డవి వస్తుమాత్రమున వ్యంగ్యము లగును. మరొకప్పు డలంకారమున వ్యంగ్యము లగును. వస్తుమాత్రమున నలంకారములు వ్యజ్యమానము లగునపుడు వానికి ధ్వన్యంగత్వము ధ్రువముగా నగును. కావ్యవ్యవహారము తదాశ్రయమై యుండును కదా! అట్టి స్థలము లందు తాదృశ వ్యంగ్యాలంకార పరముగనే కావ్య ప్రవృత్తి యున్నది. అలంకారముచే నలంకార మభివ్యంగ్య మగు నపుడు చారుత్వాతిశయము ననుసరించి వ్యంగ్య ప్రాధాన్యమే గోచరించునేని ధ్వన్యంగత్వమె సిద్ధించును.

ధ్వన్యాభాసము.

ఎచటనేని ప్రతీయమానార్థము ప్రక్లిష్టముగా భాసించినను వాచ్యమున కంగముగా భాసించినను అది యీ ధ్వని గోచరము కాదు. ప్రతీయమానార్థము స్ఫుట మస్ఫుటముగ నుండును. స్ఫుటమగు ప్రతీయమానా

కమలాకరా న మలితా హంసా ఉడ్డయితా న సహసా
కేనాపి గ్రామతడాగే అభ్రముత్తానితం క్షిప్తం.

అత్ర హి ప్రతీయమానస్య ముగ్ధవధ్వాః జలధర ప్రతిబింబదర్శనస్య వాచ్యాంగత్వమేవ. యత్ర వ్యంగ్యాపేక్షయా వాచ్యస్య చారుత్వోత్కర్ష ప్రతీత్యా ప్రాధాన్యమవసీయతే తత్ర వ్యంగ్యస్య అంగత్వేన ప్రతీతేః ధ్వనేరవిషయత్వం యథా;

వానీర కుడుంగోడ్డీన శకుని కోలాహలం శృణ్వంత్యాః
గృహకర్మ వ్యాపృతాయా వధ్వాః శ్యామలం వదనం.

యత్ర తు ప్రకరణాదిప్రతిపత్త్యా నిర్ధారితవిశేషో వాచ్యోర్థః పునః ప్రతీయమానాంగత్వేనావభాసతే సోస్యైవ అనురణనరూపస్య ధ్వనేః మార్గః యథా;

ఉచ్చినుపతితం కుసుమం మా ధునీహి! శేఫాలికాం హాలికస్నుషే!
ఏష తే విషమవిరావః శ్వశురేణ శ్రుతో వలయశబ్దః.

---

ర్థమే ధ్వని మార్గము. స్ఫుటమైనను వాచ్యమున కంగముగా ప్రతీయమాన మగునేని యీ ధ్వనివిషయము కాజాలదు. ఉదా:—

ఒక ముగ్ధవనిత గ్రామతటాకములో ప్రతిబింబించిన మేఘమును చూచినది. విస్మిత యయినది. మేనత్త కిట్లు పలికినది. "అత్తా! తటాకము మలినము కాలేదు. హంస లెగిరిపోలేదు. ఎవడో నిపుణుడు గ్రామ తటాకములో మేఘమును వెల్లకిల వేసినాడే;"

దీనిలో ముగ్ధ వధువునకు జలధర ప్రతిబింబ దర్శనము ప్రతీయమానార్థము. అది వాచ్యాంగమె యయినది. కొన్ని స్థలము లందు వ్యంగ్యము కన్న వాచ్యమె చారుత్వాతిశయ ముండుటచే ప్రాధాన్యము కలిగిన దగును. అపు డచట వ్యంగ్య మంగముగ ప్రతీత మగును గాన నది ధ్వని విషయము కాదు. ఉదా;

వేతస లతా నికుంజములో శకుంతము లెగిరినవి. ఇంటిపనులలో మగ్నురా లయిన పడుచు కోడ లా శకుంత కోలాహలము వినినది. ఆ పిల్ల యంగము లన్నియు వేదన పొందినవి. ఈ పద్యములో నీ పడుచు చౌర్య కాముక రతమునకు తగిన స్థానసంకేతము కుదిర్చికొన్న దన్న వ్యంగ్యము కన్న వాచ్యార్థమె చారుత్వాతిశయము కలది.

అత్ర హి అవినయపతినా సహ రమమాణా సఖీ బహిః శ్రుతవలయ కలకలయా సఖ్యా ప్రతిబోధ్యతే. ఏతదపేక్షణీయం వాచ్యార్థ ప్రతి పత్తయే. ప్రతిపన్నే చ వాచ్యార్థే తస్య అవినయ ప్రచ్ఛాదన తాత్పర్యేణ అభిధీయమానత్వాత్ పునర్వ్యంగ్యత్వమేవ, ఇతి అస్మిన్ ధ్వనౌ అంత ర్భావః తథా; అవ్యుత్పత్తేరశక్తేర్వా ఉపచరితస్య శబ్దస్య యః నిబంధః స చ ధ్వనేర్విషయో న. యతః

సర్వేష్వేవ ప్రభేదేషు స్ఫుటత్వేనావభాసనం
యద్వ్యంగ్యస్యాంగిభూతస్య తత్పూర్ణం ధ్వనిలక్షణం.

ఇతి ద్వితీయః

---

ప్రకరణాది పరిజ్ఞానమున వాచ్యార్థ విశేషము చక్కగా నిర్ధారిత మయిన పిమ్మట మఱల నది ప్రతీయమానాంగము గనే యవభాసించు నేని యది యీ యనురణన రూప ధ్వని మార్గమె యగును. ఉదా;

"ఓ కైతుకోడలా! క్రిందపడిన పువ్వుఏరికో! శేఫాలిక కొమ్మను విదల్పకు! ఈ విషమ ధ్వని కల నీ కంకణ నిక్వాణమును నీ మామ విన గలడు సుమా!"

ఒక హాలికుని క్రొత్త కోడలు తోటలో నవినయ పతితో రమించు చున్నది. ఆమె వలయ కలకలము బయటికి వినపడు చున్నది. అది వినిన సఖి యిట్లు హెచ్చరిక చేయుచున్నది, వాచ్యార్థపరిజ్ఞానము కలఁగుటకై యీ చెప్పిన ప్రకరణార్థ మావశ్యకము. ఇట్లు వాచ్యార్థము ప్రతిపన్న మయిన పిమ్మట "ఈ యర్థము కేవలము కోడలి యవినయరీతిని కప్పిపుచ్చు టకే సఖి చెప్పిన దని స్పష్ట మగును. ఇందలి వాచ్యార్థమంతయు తాత్పర్య పర్యాలోచనమున వ్యంగ్యాగమె యగును గావున నిది ధ్వని యందే యంతర్భవించును. అట్లే యవ్యుత్పత్తి వలన గాని, యశక్తి వలన గాని యుప చరిత శబ్ద నిబంధన మున్నచో నదియు ధ్వని విషయము కాదు. సర్వప్రభే దము లందును అంగిభూత వ్యంగ్య మునకు స్ఫుటముగా నవభాస ముండుట పూర్ణ మగు ధ్వని లక్షణము.

ద్వితీయోద్ద్యోతము.

# ధ్వ ని సా రః

## తృతీయః

ఏవం వ్యంగ్యముఖేన ధ్వనేః స్వరూపం ప్రదర్శితం పునర్వ్యంజక ముఖేన ప్రదర్శ్యతే. అవివక్షితవాచ్యస్య ధ్వనేః, తదన్యస్య అనురణన రూప వ్యంగ్యస్య చ ధ్వనేః పద ప్రకాశతా వాక్యప్రకాశతా అస్తి కావ్యానాం చారుత్వప్రతీతిః సంస్థానవిశేషావచ్ఛిన్న సముదాయ సాధ్యాపి అన్వయవ్యతిరేకాభ్యాం భాగేషు కల్ప్యతే. ఇతి పదానామపి వ్యంజకత్వ ముఖేన వ్యవస్థితో ధ్వనివ్యవహారః న విరోధీ. విచ్ఛిత్తిశోభినా ఏకేన భూషణేన యథా కామినీ భాతి, పదద్యోత్యేన ధ్వనినా సుకవేర్భారతీ భాతి.

అలక్ష్యక్రమవ్యంగ్యధ్వనిః వర్ణే, పదే, వాక్యే సంఘటనాయాం, ప్రబంధే పదావయవే చ దీప్యతే. తత్ర సంఘటనా త్రివిధా, అసమాసా, మధ్యమ సమాసా, దీర్ఘసమాసా ఇతి. మాధుర్యాదీన్ గుణానాశ్రిత్య తిష్ఠంతీ

---

ఇట్లు వ్యంగ్య ముఖమున ధ్వని స్వరూపము ప్రదర్శిత మైనది ఇక వ్యంజక ముఖమున దాని ప్రదర్శింప వలయును. అవివక్షితవాచ్య ధ్వనికిని తదన్యమగు ననురణన రూప ధ్వనికిని పదప్రకాశత, వాక్యప్రకాశత కలదు. కావ్యముల చారుత్వ ప్రతీతి సంస్థాన విశేషముతో కూడుకొనిన సముదాయముచే సాధింపదగినది యయినప్పటికిని నన్వయ వ్యతిరేక ములచే దానిని భాగములందు కల్పించుట ప్రసిద్ధముగా నున్నది. అట్లే పదములకును వ్యంజకత్వ ముఖమున వ్యవస్థితమగు ధ్వని వ్యవహారము విరుద్ధము కాజాలదు ఆ పదమున్ననే యీ వ్యంగ్య ముండును. అది లేకున్న నది యుండదు. కావున దానిలో నదియే హేతువు అందుననే తద్వ్యంజనము తదధీనమని యనుట. విచ్ఛిత్తి విశేష శోభిత మైన యొక భూషణమున కామిని కమనీయగా భాసించునటుల పద ద్యోత్య మగు ధ్వనిచే సుకవి భారతియు భాసించును.

అలక్ష్యక్రమ వ్యంగ్య ధ్వని వర్ణము నందును, పద మందును, వాక్య మందును, సంఘటన యందును, ప్రబంధముననను పదావయవ మునను దీపించును. అందు సంఘటన యనునది మూడు విధములు. అసమాస సంఘటన, మధ్యమ సమాస సంఘటన, దీర్ఘ సమాస సంఘటన. మాధుర్యాది గుణముల

సంఘటనా రసాన్ వ్యనక్తి. సంఘటనాయా నియమే వక్తృవాచ్యయో రౌచిత్యం హేతుః. తత్ర వక్తా కవిః కవినిబద్ధో వా, సోపి రసభావరహితస్సహితో వా, రసోపి కథానాయకాశ్రయః తద్విపక్షాశ్రయో వా. వాచ్యం చ ధ్వన్యాత్మరసాంగం, రసాభాసాంగం వా, అభినేయార్థమనభినేయార్థం వా, యదా కవిరపగతరసభావః తదా రచనాయాః కామచారః కవినిబద్ధో వా రసభావరహితస్తదా స ఏవ. యదా తౌ రసభావసమన్వితౌ రసశ్చ ప్రధానః, తదా నియమేనైవ అసమాసా మధ్యమసమాసా సంఘటనా. కరుణవిప్రలంభశృంగారయోరసమాసైవ. రసో యదా ప్రాధాన్యేన ప్రతిపాద్యః తదా తత్ప్రతీతౌ వ్యవధాయకా విరోధినశ్చ సర్వాత్మనైవ పరిహార్యాః, దీర్ఘసమాసా సంఘటనా కదాచిద్రసప్రతీతిం వ్యవదధాతి. విశేషతోభినేయార్థే. తత్ర కరుణవిప్రలంభశృంగారయోః. తయోస్సుకుమారతరత్వాత్ స్వల్పాయామప్యస్వచ్ఛతాయాం శబ్దార్థయోః ప్రతీతిర్మంథరీభవతి.

---

నాశ్రయించి యుండు సంఘటన రసముల నభివ్యక్తము చేయును. వక్తృగతమైన యౌచిత్యము, వాచ్యార్థమైన యౌచిత్యము సంఘటన నియమమున హేతువు. వక్త యగు నతడు కవియు కవి నిబద్ధుడును. ఆతడును రస రహితుడు సహితుడు నగును. రసమును కథానాయకాశ్రయమున గాని, తద్విపక్షాశ్రయమున గాని యుండును. వాచ్యమును ధ్వన్యాత్మ రసాంగముగ నుండును. రసాభాసాంగముగ నుండును. అభినేయార్థముగను, అనభినేయార్థముగను నుండును. కవి యపగత రసభావు డేని రచన కామచారమున నుండ వచ్చును. కవి నిబద్ధు డేని రస భావ రహితు డగుచో నప్పుడు నదే నియమము. కవి కవినిబద్ధులు రస భావ సమన్వితు లగుదు రేని, రసమును ప్రధాన మగు నేని. నియమముగా నప్పుడు అసమాస సంఘటన, మధ్యమ సమాస సంఘటన యుండ వలెను. కరుణ విప్రలంభ శృంగార ములలో నసమాస రచనయే యుండ వలయును. రసము ప్రాధాన్యమున ప్రతిపాద్య మగు నేని యప్పుడా రస ప్రతీతిలో వ్యవధాయకములు విరోధులు నగు వానిని సర్వ విధముల పరిహరించి తీరవలసినదే. దీర్ఘ సమాస సంఘటన యొకప్పుడు రస ప్రతీతిని వ్యవధానించునది యగును. విశేషముగా నభినేయార్థము నందు

సర్వాసు రచనాసు ప్రసాదగుణో వ్యాపీ. ప్రసాదాతిక్రమే అసమాసాపి సంఘటనా కరుణవిప్రలంభశృంగారౌ నవ్యనక్తి. తదపరిత్యాగే మధ్యమసమాసాపి ప్రకాశయతి. తస్మాత్సర్వత్ర ప్రసాదోనుసర్తవ్యః. విషయాశ్రయమప్యౌచిత్యం సంఘటనాం నియచ్ఛతి. కావ్యప్రభేదాశ్రయతః సంఘటనా భేదవతీ స్థితా. కావ్యస్య ప్రభేదాః ముక్తకం, సందానితకం, విశేషకం, కాలాపకం, కులకం, పర్యాయబంధః, పరికథా, సకలకథా, ఖండకథా, సర్గబంధః, అభినేయార్థం, ఆఖ్యాయికా, కథా ఇత్యేవమాదయః తదాశ్రయేణాపి సంఘటనా విశేషవతీ, ముక్తకేషు హి ప్రబంధేష్వివ రసబంధాభినివేశినః కవయః దృశ్యంతే. అమరుకస్య కవేః ముక్తకాః శృంగారరస స్యందినః ప్రబంధాయమానాః ప్రసిద్ధాః. సర్గబంధే రసతాత్పర్యే

---

రసప్రతీతి వ్యవహిత మగును. అంతకన్నను కరుణ విప్రలంభ శృంగారములందు ప్రతీతి విఘ్నిత మగును. కరుణము విప్రలంభ శృంగార మును సుకుమార తరములు. స్వల్పముగా నస్వచ్ఛత యున్నను శబ్దార్థముల ప్రతీతి మంథర మగును.

సర్వ విధము లయిన రచనల యందును ప్రసాద గుణము వ్యాపించి యుండును. ప్రసాదము నతిక్రమించినచో సంఘటన యసమాస యయ్యును కరుణ విప్రలంభ శృంగారములను, వ్యంజనము చేయ జాలదు. ప్రసాద గుణమును పరిత్యజింపక పోయినచో సంఘటన మధ్యమ సమాస యయ్యును వానిని ప్రకాశము చేయును. కావున నంతట ప్రసాదము ననుసరింపవలయును.

విషయాశ్రయ మగు నౌచిత్యముకూడ సంఘటనా నియామక మగుచున్నది. కావ్య ప్రభేదాశ్రయమున సంఘటన భిన్న భిన్న మగును. కావ్య ప్రభేదము లనేకములు గలవు. ముక్తకము, సందానితకము, విశేషకము, కాలాపకము, కులకము, పర్యాయబంధము, పరికథ, సకలకథ, ఖండకథ, సర్గబంధము, అభినేయార్థము, ఆఖ్యాయిక, కథ మొదలగు ప్రభేదము లెన్నియో కలవు. తదాశ్రయ మైన సంఘటన కూడ విశేషము కలది యగును. ముక్తకము లందును ప్రబంధము లందు వలె కవులు రసబంధాభినివేశులై కన్పడు చున్నారు. అమరుక కవి ముక్తకములు శృంగారరస స్యందులై ప్రబంధాయమానములై యుండుట సర్వప్రసిద్ధము. సర్గబంధ

యథారసమౌచిత్యం అన్యథా తు కామచారః, అభినేయార్థే తు సర్వథా రసబంధాభినివేశః కార్యః, సర్వత్ర గద్యబంధేపి యథోక్తమౌచిత్యం నియామకం. రసబంధోక్త మౌచిత్యంసంశ్రితా రచనా పద్యవద్గద్యబంధేపి భాతి. విషయాశ్రయం తు రసౌచిత్యం కించిద్విభేదవత్ భవతి. చేతశ్చమత్కృతివిధాయీఅయం కావ్యార్థవివేకః న విస్మార్యః.

అథ ప్రబంధాత్మనః ధ్వనేః ప్రకాశనం.

ప్రథమం తావత్ విభావ భావానుభావ సంచార్యౌచిత్య చారుణః కథాశరీరస్య విధిః, వ్యంజకత్వే నిబంధనమేకం. తత్ర విభావౌచిత్యం ప్రసిద్ధం భావౌచిత్యం ప్రకృత్యౌచిత్యాద్భవతి. ఉత్తమ మధ్యమాదిభేదేన దివ్య మానుషాది భావేన విభేదినీ. తామనుసృత్య స్థాయీ భావ ఉపనిబధ్యమానః ఔచిత్యవాన్ భవతి. అన్యథా తు కేవలమానుషాశ్రయేణ దివ్యస్య కేవల దివ్యాశ్రయేణ వా మానుషస్య ఉత్సాహాదయ ఉపనిబధ్యమానా అనుచితా భవంతి. తథా చ కేవలమానుషస్య రాజాదేర్వర్ణనే సప్తార్ణవలంఘనాది లక్షణా వ్యాపారా ఉపనిబధ్యమానా సౌష్ఠవభృతోపి నియమేన నీరసా భాంతి. తత్ర త్వనౌచిత్యమేవ హేతుః రాజ్ఞాం ప్రభావాతిశయ

---

మున రస తాత్పర్య ముండునేని రసానుకూలమైన యౌచిత్యము ననుసరింప వలయును. లేకున్నచో కామచారమే. అభినేయార్థము నందు సర్వవిధముల రసబంధాభినివేశ ముండుట యావశ్యకము. గద్యబంధము లందును నంతట నీ చెప్పిన యౌచిత్యమే నియామకము. రస బంధము నందు నిరూపితమయిన యౌచిత్యము నాశ్రయించు రచన పద్య బంధము నందు వలె గద్య బంధము నందును భాసించును. విషయాశ్రయమగు రసౌచిత్యము కొంత విభిన్న మగును. చేతశ్చమత్కృతి విధాయి యగు నీ కావ్యార్థ మెప్పుడును విస్మార్యము కాదు.

ఇక ప్రబంధాత్మక మైన ధ్వనిని ప్రకాశింప జేయ వలసి యున్నది. మొదటగా విభావ భావానుభావ సంచారుల యౌచిత్య మనోహరమైన కథా శరీరమును విధించుట ప్రబంధము వ్యంజక మగుటలో నిబంధనము. అందు విభావౌచిత్యము ప్రసిద్ధమే. భావౌచిత్యము ప్రకృత్యౌచిత్యము ననుసరించి యుండును. తదనుకూలముగా నిబంధనము పొందిన స్థాయిభావ మౌచిత్యవంత మగును. కాక పోయినచో దివ్యునకు కేవల మానుషాశ్ర

వర్ణనం న వయ మనుచితం బ్రూమః. కింతు కేవల మానుషాశ్రయేణ యా ఉత్పాద్యవస్తుకథా క్రియతే తస్యాం దివ్యమౌచిత్యం న యోజనీయం. దివ్యమానుషాయాం తు కథాయాం ఉభయం ఔచిత్యయోజనమవిరుద్ధమేవ. అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణం. ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్య ఉపనిషత్పరా. అతఏవ భరతే ప్రఖ్యాతవస్తువిషయత్వం ప్రఖ్యాతోదాత్తనాయకత్వం నాటకస్య ఆవశ్యకర్తవ్యతయా ఉపన్యస్తం. తేన హి నాయకౌచిత్యానౌచిత్యవిషయే కవిర్న ముహ్యతి. యస్తు ఉత్పాద్యవస్తు నాటకాది కుర్యాత్తస్య అప్రసిద్ధానుచిత నాయక స్వభావ వర్ణనే మహాన్ ప్రమాదః.

రతివిషయే ఔచిత్యాతిక్రమేణ సుతరాం దోషః. తథా హి; అధమ ప్రకృత్యౌచిత్యేన ఉత్తమ ప్రకృతేః శృంగారోపనిబంధనే కా భవేన్నోపహాస్యతా? భారతవర్ష విషయే యథా ఉత్తమనాయకేషు రాజాదిషు శృంగారోపనిబంధః తథా దివ్యాశ్రయోపి శోభతే. న చ రాజాదిషు ప్రసిద్ధగ్రామ్య శృంగారోపనిబంధనం ప్రసిద్ధం నాటకాదౌ. తన్నైవ దేవేషు తత్పరిహర్తవ్యం.

---

యము లైన ఉత్సాహాదులను, మానవునకు కేవల దివ్యాశ్రయము లయిన యుత్సాహాదుల నుపనిబంధించినచో నవి యనుచితము లగును. కేవల మానవులైన రాజాదులను వర్ణించు నపుడు సప్తార్ణవ లంఘనాది వ్యాపారము లుపనిబధ్యమానములై సౌష్ఠవము కలిగి యున్నను నవశ్యముగా నీరసములే యగును. అందనౌచిత్యమే హేతువు. రాజులకు ప్రభావాతిశయ వర్ణన మనుచిత మని మే మనుటలేదు. కేవల మానుషాశ్రయమున కల్పిత వస్తుకమైన కథా నిబంధ మొనరించు నపు డా కథలో నుభయౌచిత్య యోజన మవిరుద్ధము. రసభంగమున కనౌచిత్యమే కారణము. అంతకు మించి వేరొక హేతువు లేదు. ప్రసిద్ధౌచిత్య బంధ మనునది రమ్యమైన రసోపనిషత్తు. కావుననే భరత గ్రంథము నందు నాటకము ప్రఖ్యాత వస్తు విషయకము గా నుండవలయు నని, ప్రఖ్యాతోదాత్త నాయకమై యుండవలయు నని, యవి యచట నావశ్యకము లని యుపన్యస్తమైనది. అట్లున్నచో నాయకౌచిత్యానౌచిత్య విషయమున కవి వ్యామోహితుడు కాడు. నాటకాదులలో కల్పితకథా నిబంధనము చేయు నపుడు అప్రసిద్ధానుచిత నాయక స్వభావ వర్ణనమున కవి ప్రమాదము కలవాడగును.

అభినేయార్థే కావ్యే చ యదుత్తమప్రకృతే రాజాదేః ఉత్తమప్రకృతిభిః నాయికాభిః సహ గ్రామ్య సంభోగవర్ణనం తత్ పిత్రోః సంభోగవర్ణనమివ సుతరామసహ్యం. తథైవోత్తమ దేవతావిషయం. తస్మాదుత్సాహవత్ రతావపి ప్రకృత్యౌచిత్యమనుసర్తవ్యం. తథైవ విస్మయాదిషు. యత్తు ఏవంవిధే విషయే మహాకవీనామప్యసమీక్ష్య కారితా దృశ్యతే స దోష ఏవ. స తు శక్తితిరస్కృతత్వాత్తేషాం న లక్ష్యతే. ద్వివిధో హి దోషః. అవ్యుత్పత్తి కృతః. అశక్తికృతశ్చ. తత్ర అవ్యుత్పత్తి కృతో దోషః శక్తితిరస్కృతత్వాత్ కదాచిన్న లక్ష్యతే. యస్తు అశక్తి కృతో దోషః స ఝడితి ప్రతీయతే శక్తిరహితేన కవినా శృంగార ఉపనిబధ్యమానః స్ఫుటమేవ దోషత్వేన ప్రతిభాసతే.

---

రతి విషయమున నౌచిత్య మతిక్రమించుటచే మిక్కిలి దోషము వాటిల్లును. ఉత్తమ ప్రకృతి యగు వాని కథమప్రకృత్యౌచిత్యము ననుసరించి శృంగారము నుపనిబంధన మొనరించినచో నుపహాస్యత కలుగకుండు నేమి? భారతదేశమున నుత్తమ నాయకు లగు రాజాదుల విషయమై శృంగారోపనిబంధన మున్నట్లుగ దివ్యాశ్రయముగ శృంగారము నిబంధించుట శోభించును. ఉత్తము లైన రాజాదుల విషయమై నాటకాదులలో గ్రామ్య శృంగారోపనిబంధనము ప్రసిద్ధము కాదుగదా! అట్లే దివ్య ప్రకృతుల విషయమైకూడ గ్రామ్య శృంగారోపనిబంధనము పరిహరింపవలెను. అభినేయార్థ మందును, కావ్యమందును నుత్తమ ప్రకృతు లైన రాజాదులకు ఉత్తమ ప్రకృతిక లైన నాయికలతో గ్రామ్య సంభోగ వర్ణనము పితరుల సంభోగ వర్ణనము వలె నత్యంత మసహ్యము. అట్లే ఉత్తమ దేవతా విషయ మనియు గ్రహింప వలయును. కావున ఉత్సాహము నందు వలె రతి యందును ప్రకృత్యౌచిత్యము ననుసరింప వలెను. ఇట్లే విస్మయాదులందును గ్రహించునది. ఇట్టి విషయము లందును మహాకవుల యసమీక్ష్యకారిత కన్పడుచున్నది. అది దోషమే యగును. కాని యది శక్తి తిరస్కృత మగుటచే మహాకవుల దోషము దోషముగా కన్పడదు. దోష మనునదీ రెండు విధములు. అవ్యుత్పత్తికృతము, అశక్తికృతము నని. అం దవ్యుత్పత్తి కృత మగు దోషము శక్తి తిరస్కృత మగుటచే నొకప్పుడు లక్షితము గాదు. అశక్తి కృత మగు దోష మది వెంటనే ప్రతీత మగును. శక్తిరహితు డగు

అనుభావౌచిత్యం తు భరతాదౌ ప్రసిద్ధమేవ భరతాదిస్థితిం చానువర్తమానేన మహాకవి ప్రబంధాంశ్చ పర్యాలోచయతా, స్వప్రతిభాం చానుసరతా, కవినా అవహితచేతసా భూత్వా విభావాద్యౌచిత్య భ్రంశ పరిత్యాగే పరః ప్రయత్నో విధేయః. ఏవం విభావాద్యౌచిత్యవతః కథా శరీరస్య వృత్తస్య ఉత్ప్రేక్షితస్య వా గ్రహో వ్యంజకః. ఇతిహాసాదిషు రసవతీషు కథాసు వివిధాసు సతీష్వపి, యత్తత్ర విభావాద్యౌచిత్యవత్కథాశరీరం తదేవ గ్రాహ్యం నేతరత్ వృత్తాదపి చ కథాశరీరాత్ ఉత్ప్రేక్షితే విశేషతః ప్రయత్నవతా భవితవ్యం. తత్ర హి అనవధానాత్స్ఖలతః కవేరవ్యుత్పత్తి సంభావనా మహతీ భవతి. యథా సర్వమేతద్రసమయం ప్రతిభాసతే తథా కథాశరీరముత్పాద్యవస్తు కార్యం. తత్ర చాభ్యుపాయః సమ్యగ్విభావాద్యౌచిత్యానుసరణం. రామాయణాదయః సిద్ధరసప్రఖ్యా యే సంతి తైః కథాశ్రయా రసవిరోధినీ స్వేచ్ఛా న యోజ్యా. తత్ర తావత్ స్వేచ్ఛైవ న యోజ్యా. స్వేచ్ఛాపి యది యోజ్యా తద్రసవిరోధినీ న యోజ్యా.

---

కవి యుపనిబంధించిన యట్టి శృంగారము స్ఫుటముగా దోషమై ప్రతిభాసించును. కాళిదాస కుమారసంభవమున నిది సంభావనీయము.

అనుభావౌచిత్యము భరత గ్రంథము మొదలగు వానియందు ప్రసిద్ధమే. భరతాది స్థితి ననుసరించుచు మహాకవి ప్రబంధములను పర్యాలోచనము చేయుచు, తన ప్రతిభ ననుసరించుచు కవి యవహిత చేతస్కుడై విభావాద్యౌచిత్య భ్రంశ పరిత్యాగమున పరప్రయత్నమును స్వీకరింప వలయును.

ఈ విధముగా విభావాద్యౌచిత్యము కల కథా శరీరము పురాణేతిహాస ప్రసిద్ధ మైనను, కవి కపోలోత్ప్రేక్షిత మైనను పరిగ్రహించి నిబంధించుట వ్యంజక మగును. రసవంతము లైన కథ లనేకములు పురాణేతిహాసము లందున్నను వానిలో విభావాద్యౌచిత్యము కల కథా శరీరమునే పరిగ్రహింప వలయును. ఇతర మగ్రాహ్యము. కవి, ప్రసిద్ధశరీరమున కన్న కల్పితకథా శరీరమున విశేషముగా ప్రయత్నము కలవాడు కావలయును. కల్పిత కథా శరీరమున ననవధానమున పరిస్ఖలనము పొందిన కవికి గొప్ప యవ్యుత్పత్తి సంభావన కలిగి తీరును. తన కావ్య మంతయు రసమయమై ప్రతిభాసించు నటుల నుత్పాద్య వస్తుక మైన కథాశరీరమును సంధానింప

ఇతివృత్తవశాయాతాం రసాననుగుణాం స్థితిం త్యక్త్వా పునః ఉత్ప్రేక్ష్యాపి అంతరా అభీష్టరసోచితకథోన్నయః విధేయః. యథా కాళిదాసప్రబంధేషు. ప్రబంధముపనిబధ్నతా కవినా సర్వాత్మనా రసపరతంత్రేణ భవితవ్యం. ఇతివృత్తే రసాననుగుణాం స్థితిం యది పశ్యేత్ తాం భంక్త్వాపి స్వతంత్రతయా రసానుగుణం కథాంతరముత్పాదయేత్. న హి కవేరితివృత్తమాత్రనిర్వహణేన కించిత్ ప్రయోజనం ఇతిహాసాదేవ సిద్ధేః.

ముఖాదిసంధీనాం తదంగానాం చ రసాభివ్యక్త్యపేక్షయా ఘటనం న తు కేవలం శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా. యథావసరం రసస్య ఉద్దీపనం ప్రశమనం చ కర్తవ్యం. ఆరబ్ధవిశ్రాంతేః అంగినః రసస్య అనుసంధిశ్చ కర్తవ్యా. ప్రబంధవిశేషస్య నాటకాదేః రసవ్యక్తినిమిత్తమిదం చ అపరమవ

---

వలెను. చక్కగా విభావౌచిత్యానుసరణ మిందుచిత మైన యభ్యుపాయము. సిద్ధరస ప్రఖ్యము లైన రామాయణాదుల నుండి కథను స్వీకరించి నప్పుడు కథాశ్రయ మైన రసవిరోధి స్వేచ్ఛ నాయోజింప రాదు. ఆస లట్టివానిలో స్వేచ్ఛ యాయోజ్య మేని కొంత దానికలుపుకొన వచ్చును కాని, రస విరోధి స్వేచ్ఛను మాత్రము కూర్పరాదు.

ఇతివృత్త వశమున రసాననుగుణ మైన స్థితి వచ్చినచో దానిని పరిత్యజించి మరల నభీష్ట రసోచిత మైన కథ నచట కల్పించి యైన నంతరాళమున విధింప వచ్చును. కాళిదాస ప్రబంధము లందిట్లే యున్నది. ప్రబంధ నిబంధనము చేయు కవి సర్వవిధముల రస పరతంత్రుడు కావలెను. ఇతివృత్తము నందు రసాననుగుణ స్థితిని తా నుపలక్షించినచో స్వతంత్రముగా రసానుగుణ కథాంతరమును కల్పించ వచ్చును. కవి కితివృత్త మాత్ర నిర్వహణమున కొంచెమైన ప్రయోజనము లేదు. కథామాత్ర మితిహాసాదుల వలననే సిద్ధించును గదా!

ముఖ ప్రతిముఖాది పంచసంధులను, తదంగములను, రసాభివ్యక్తి నుద్దేశించియే కూర్పవలయును. కేవలము శాస్త్రస్థితి సంపాదనేచ్ఛ సముచితము కాదు. అవసరానుసారముగా రసము నుద్దీపింప జేయుటయు, ప్రశమింప జేయుటయు యుక్తక్రియ. కథాప్రారంభము మొదలు విశ్రాంతి వరకు అంగిరసము ననుసంధానము జేయుటయు సముచితము. నాటకాది ప్రబంధ విశేషముల రసాభివ్యక్తికి నిదియు వేరొక నిమిత్తమని గుర్తింప వలెను.

గంతవ్యం. యత్ అలంకృతీనాం శక్తావప్యానురూప్యేణ యోజనం కర్తవ్యం. శక్తో హి కవిః కదాచి దలంకార నిబంధనే తథాక్షిప్త తయైవ. అనపేక్షిత రసబంధః ప్రబంధ మారభతే. త దుపదేశార్థ మిద ముక్తం.

అనుస్వానోప మాత్మాపి ప్రభేదః కేషుచి త్ప్రబంధేషు ద్యోతతే. అసంలక్ష్య క్రమస్తు రసాదిః సుప్ తిఙ్ వచన సబంధైః కారక శక్తిభిః కృ త్తద్ధిత సమాసైః నిపా తోపసర్గ కాలాదిభిః అభివ్యజ్యమానో దృశ్యతే. యథా;

న్యక్కారో హ్యయమేవ మే యదరయస్తత్రాప్యసౌ తాపసః
సోఽప్యత్రైవ నిహన్తి రాక్షసకులం జీవత్యహో! రావణః
ధిగ్ధిక్ఛక్రజితం ప్రబోధితవతా కిం కుంభకర్ణేన వా?
స్వర్గగ్రామటికా విలుంఠన వృథోచ్ఛూనైః కిమేభిర్భుజైః?

అత్ర హి శ్లోకే భూయసా సర్వేషామప్యేషాం స్ఫుటమేవ వ్యంజకత్వం దృశ్యతే తత్ర మే యదరయః ఇత్యనేన సుప్సంబంధవచనానా మభివ్యంజకత్వమ్ 'తత్రాప్యసౌ తాపస' ఇత్యత్ర తద్ధిత నిపాతయోః

---

శక్తి యున్నను నలంకారముల ననురూపముగా యోజనను చేయవలెను. సామర్థ్య మున్నది కదా యని యొక్కొక కవి యొక్కొక సమయమున రసబంధమును పర్యవేక్షింపక కేవల మలంకారాక్షిప్త హృదయుడై యలంకార నిబంధనము నందే యాసక్తుడై ప్రబంధ మారంభించుట యున్నది. అట్టివాని యుపదేశమునకై యీ యంశమును చెప్పవలసి వచ్చినది.

అనుస్వానోపమ ధ్వనిప్రభేదమును కొన్ని ప్రబంధము లందు గోచరించును. అసంలక్ష్యక్రమ మైన రసాది ధ్వని సుప్తిఙ్ వచన సంబంధములచే, కారక కాలశక్తులచే, కృత్తద్ధిత సమాసములచే, నిపాతోపసర్గ కాలాదులచే నభివ్యజ్యమాన మగుట లక్ష్యము లందు గోచరించు చున్నది.

నాకు శత్రువు లున్నా రనుట యిదియె తిరస్కారము. అందును ఈ తాపసుడు. అతడు నిచటనే రాక్షస కులమును హతము చేయుచున్నాడు. అహో! రావణుడు జీవించియే యున్నాడు! ఛీ! ఛీ! ఇంద్రజిత్తు వలన నేమి లాభము? మేల్కొలిపితిని. కుంభకర్ణుని వలన నేమి యున్నది? స్వర్గ మన్న పల్లెగూడెములో పొరలి పొరలి వ్యర్థముగా బలసిన యీ భుజముల వలన మాత్ర మేమిలాభము?

'సోఽప్యత్రైవ నిహంతి రాక్షసకులం. జీవత్యహో రావణః' ఇత్యత్ర తిఙ్కారక కాలశక్తీనాం "ధిగ్ధిక్ఛక్రజితమ్" ఇత్యాదౌ శ్లోకార్ధే కృత్తద్ధిత సమాసోపసర్గాణామ్. ఏవం విధస్య వ్యంజకభూయస్త్వే చ ఘటమానే కావ్యస్య సర్వాతిశాయినీ బంధచ్ఛాయా సమున్మీలతి. యత్ర హి వ్యంగ్యావభాసినః పదస్యైకస్యాపి తావదావిర్భావస్తత్రాపి కావ్యే కాపి బంధచ్ఛాయా కిముత యత్ర తేషాం బహూనాం సమవాయః! యథాత్రానంతరోదితశ్లోకే. అత్ర హి "రావణ" ఇత్యస్మిన్ పదే అర్థాంతర సంక్రమిత వాచ్యేన ధ్వనిప్రభేదేనాలంకృతేఽపి పునరనంతరోక్తానాం వ్యంజక ప్రకారాణాముద్భాసనమ్. దృశ్యంతే చ మహాత్మనాం ప్రతిభావిశేషభాజాం బాహుల్యేనైవంవిధా బంధప్రకారాః అనయా దిశా సహృదయై రన్యేఽపి వ్యంజక విశేషాః స్వయ ముత్ప్రేక్షణీయాః.

రసాదయః అర్థసామర్థ్యాక్షేప్యాః తథాపి సుబాదీనాం వ్యంజకత్వవైచిత్ర్య కథనం యుక్తమేవ. రసాది ప్రతిపాదకార్థ విశేషాణాం వ్యంజక

---

ఈ పద్యమున మొత్తముపై నన్నియు వ్యంజకములై యుండుట స్ఫుటముగనే యున్నది. "నాకు" అన్న షష్ఠీ సంబంధము, "శత్రువులు" అను బహువచనము, "అందును" అను ప్రత్యయము "తాపసు" డన్న తద్ధితము వ్యంజకము లయినవి. పద్య ద్వితీయపాదమున తిఙ్–కారక కాల శక్తులు వ్యంజకములు. తృతీయపాదమున కృత్తు–తద్ధిత–సమాసము–ఉపసర్గములు వ్యంజకము లయినవి. ఇట్లధికముగా కావ్యమునకు వ్యంజకాధిక్యము సుఘటమైనచో సర్వాతిశాయి బంధచ్ఛాయ సమున్మీలిత మగును. వ్యంగ్యము నవభాసింప జేయు నొక పద మావిర్భవించినను నట్టి కావ్యమున నేదో బంధచ్ఛాయ భాసించును. నానావిధము లయిన వ్యంజకముల సముదాయ మున్నచో శోభాతిశయ ముండునని వేర చెప్పనక్కర లేదు. ఈ పద్యము నందే "రావణ" పద మర్థాంతర సంక్రమిత వాచ్య మన్న ధ్వని ప్రభేదాలంకృతము. అయిన నిందు నిరూపించిన విధమున వ్యంజక ప్రకారముల సముద్భాస మున్నది. ప్రతిభా విశేషము కల మహాత్ముల కిట్టి బంధ ప్రకారములు బహుళముగా సంభవించును. ఈ దిశ ననుసరించి సహృదయులగు వా రితర వ్యంజక విశేషములను స్వయముగా నుత్ప్రేక్షింప వచ్చును.

శబ్దావినాభావిత్వం తావత్ప్రసిద్ధం. శబ్దవిశేషాణాంచ చారుత్వంవ్యంజకత్వే నైవావస్థితమిత్యవగంతవ్యం. అన్యథా తుల్యే వాచకత్వే కః శబ్దానాం చారుత్వ విషయో విశేషః స్యాత్? అన్య ఏవాసౌ సహృదయ సంవేద్యః ఇతి చేత్. కిమిదం సహృదయత్వం నామ? కిం రస భావానపేక్ష కావ్యాశ్రిత సమయ విశేషాభిజ్ఞత్వం? ఉత రసభావాది మయ కావ్య స్వరూప పరిజ్ఞాన నైపుణ్యం? పూర్వస్మిన్ పక్షే తథావిధ సహృదయ వ్యవస్థాపితానాం శబ్ద విశేషాణాం చారుత్వ నియమో న స్యాత్, పునః సమయాంతరేణ అన్యథాపి వ్యవస్థాపన సంభవాత్. ద్వితీయస్మింస్తు పక్షే "రసజ్ఞతైవ సహృదయత్వ" మితి, తథావిధైః సహృదయైః సంవేద్యః రసాది సమర్పణ సామర్థ్య మేవ నైసర్గికం శబ్దానాం విశేష ఇతి. వ్యంజకత్వాశ్రయ్యేవ తేషాం ముఖ్యం చారుత్వం. వాచకత్వాశ్రయస్తు ప్రసాద ఏవ. అర్థాపేక్షయాం తేషాం విశేషః అర్థానపేక్షాయాం త్వనుప్రాసాదిరేవ.

---

రసాదు లర్థసామర్థ్యాక్షిప్యములు. అయినను సుబాదులు వ్యంజకములగు ననుట యా వ్యంజకత్వ కృతమైన వైచిత్ర్యమును చెప్పుటయు యుక్తమే యగును. రసాదులను ప్రతిపాదనము చేయు నర్థవిశేషములు వ్యంజక శబ్ద సహాభావులై యుండుట యంతట ప్రసిద్ధము. శబ్దవిశేషములకు చారుత్వము వ్యంజకత్వ రూపముననే వ్యవస్థిత మగునని తెలియ వలయును. కాకపోయినచో వాచకత్వ మంతట సమానము కాగా శబ్దములకు చారుత్వ విషయమైన విశేషమేమి యుండును? ఆ విలక్షణ విశేషము సహృదయ సంవేద్య మగునేని యా సహృదయత్వ మనునది యెట్టిదో పరిష్కరింప వలసి యుండును. రసభావాపేక్ష లేక కేవలము కావ్యాశ్రితము లైన సమయ విశేషములను తెలిసి కొనుటయే సహృదయత్వమా? అట్లు గాక రసభావాదిమయ మైన కావ్య స్వరూపము చక్కగా తెలియుట లోని నైపుణ్యమే సహృదయత్వమా? యని మీమాంసింప వలెను. రసభావాపేక్ష యక్కరలే దన్న మొదటి పక్షమునే యనుసరించినచో నట్టి సహృదయులు వ్యవస్థాపనము చేసిన శబ్దవిశేషములకు చారుత్వ నియమము ఉండనే యుండదు. వారే మరల సమయాంతరమున నన్య విధమున గూడ వ్యవస్థాపనము చేయుట సంభవింప వచ్చును. అందుచే నట్టి సహృాయ

ప్రబంధే ముక్తకే వాపి రసాదీన్ బంధుమిచ్ఛతా
యత్నః కార్యః సుమతినా పరిహారే విరోధినాం.

రస భావ నిబంధనం ప్రత్యాదృత మనాః కవిః విరోధి పరిహారే పరం యత్న మాదధీత. అన్యథాత్వస్య రసమయః శ్లోకః ఏకోపి సమ్యక్ న సంపద్యతే ఇమాని పునస్తాని విరోధీని యాని యత్నతః పరిహర్తవ్యాని

ప్రస్తుతరసాపేక్షయా విరోధీ యో రసః తస్య సంబంధినాం విభావ భావానుభావ వ్యభిచారిణాం పరిగ్రహః రసవిరోధహేతురేకః సంభావ నీయః, విభావ పరిగ్రహః యథా; శాంతరస విభావేషు తద్విభావతయైవ నిరూపితేష్వనంతరమేవ శృంగారాదివర్ణనే; భావపరిగ్రహో యథా; ప్రియం ప్రతి ప్రణయ కలహ కుపితాసు కామినీషు వైరాగ్యకథాభిరనునయే,

---

త్వము పరిగణనీయము కాదు. అట్లుగాక రసభావమయ కావ్య స్వరూప పరిజ్ఞాన నైపుణ్య రూప మైన రెండవ పక్షము ననుసరించి సహృదయత్వము పరిష్కరింతు మేని రసజ్ఞతయే సహృదత్వ మని సిద్ధ మగును. అట్టి సహృదయులు తెలియ దగినది రసాదులను సమర్పించుటలోని సామర్థ్యమే నైసర్గిక మైన శబ్దముల విశేషమని నిశ్చయింప వచ్చును. కాగా శబ్దములు వ్యంజకత్వాశ్రయ మున్న నే ముఖ్యమగు చారుత్వము కల వగును. వాచక త్వాశ్రయ మైన చారుత్వము ప్రసాదగుణమే. అందు నర్థాపేక్ష యున్నచో విశేషరూపముగా ప్రసాద మున్న దన వచ్చును. అర్థాపేక్ష లేకున్నచో నను ప్రాసాదిక మే గాని యన్య విశేష మేదియు లేదు. అచట ననుప్రాసా ద్యలంకారమే యగును.

ప్రబంధమున గాని, ముక్తకమున గాని రసబంధము నభిలషించు సచేతసుడైన కవి విరోధుల పరిహారమున యత్నము స్వీకరింప వలెను. రస భావ నిబంధనమున ఆదరమునన్న డగు వాడు విరోధి పరిహారము నం దతి శయిత యత్నము సాధానింప వలెను. లేకున్నచో నాతని పద్య మొకటేని రసమయమై చక్కగా సంపన్నము కానేరదు. యత్నమున పరిహరింప దగిన విరోధు లివిగో నిచట నిరూపింతుము.

౧. గ్రంథమున సన్నివేశింప చేయ దలచిన రసమునకు విరోధి యగు రస సంబంధు లైన విభావానుభావ వ్యభిచారులను స్వీకరించుట మొదటి రస విరోధ హేతువని భావింప వలెను. విభావ పరిగ్రహము. శాంతరస విభావ

అనుభావపరిగ్రహో యథా; ప్రణయ కుపితాయాం ప్రియాయాం అప్రసీదంత్యాం నాయకస్య కోపావేశ వివశస్య రౌద్రానుభావవర్ణనే. అయమన్యః రస భంగ హేతుః యత్ప్రస్తుత రసాపేక్షయా వస్తునః అన్యస్య కథంచి దన్వితస్యాపి విస్తరేణ కథనం యథా; విప్రలంభ శృంగారే నాయకస్య కస్యచిత్ వర్ణయితు ముపక్రాంతే కవేః యమకాలంకారనిబంధన రసికతయా మహతా ప్రబంధేన పర్వతాదివర్ణనే.

అయమన్యః. అకాండే రసస్య విచ్ఛిత్తిః అకాండే ప్రథనం. ఆద్యో యథా; నాయకస్య కస్యచిత్ స్పృహణీయ సమాగమయా నాయికయా కయాచిత్ పరాంపరిపోషపదవీం ప్రాప్తే శృంగారే విదితే చ పరస్పరానురాగే సమాగమోపాయచింతోచితం వ్యవహారముత్సృజ్య స్వతంత్రతయా వ్యాపారాంతరవర్ణనే.

ప్రవృత్తే ప్రవృద్ధవివిధవీరసంక్షయే కల్పసంక్షయకల్పే సంగ్రామే దేవప్రాయస్యాపి తావన్నాయకస్య అనుపక్రాంత విప్రలంభ శృంగారస్య నిమిత్తముచితమంతరేణైవ శృంగారకథాయామవతారవర్ణనే. అయ

---

ములు శాంతరస విభావములుగా నిరూపితములు కాగా వాని యనంతరమే శృంగారాదులను వర్ణించుటలో నుండును. భావ పరిగ్రహ మను నది ప్రియుని విషయమై కామిని ప్రణయ కలహ కుపిత యైనపుడు వైరాగ్య కథలచే ననునయ మొనర్చుటలో నుండును. ప్రియ ప్రణయ కుపితయై ప్రసన్న కాక పోగా కోపావేశ వివశు డైన నాయకుని రౌద్రానుభావ వర్ణనమున విరోధి రసానుభావ పరిగ్రహ మున్నదని గుర్తింప వలెను.

౨. ఈ చెప్పునది వేరొక రస భంగ హేతువు. ప్రస్తుత రసము కన్న వేరుగా నుండు వస్తు వొకటి ఎట్లో సమన్వయము పొందినను దానినే విస్తరముగా చెప్పుట. విప్రలంభ శృంగారమున నాయకు నొకని వర్ణించుట కుపక్రమించిన కవి యమకాలంకార రసికుడై యత్నాతిశయమున విస్తృతముగా పర్వతాదులను వర్ణించు నేని యీ రస భంగ హేతువు సిద్ధించును.

3. ఇది వే రొక రస భంగ హేతువు. ఇది రెండు విధములు : అసమయమున రస విచ్ఛిత్తి యసమయమున రసదీపనము నని. ప్రథమ మిట్లుండును. నాయకు నొకనికి స్పృహణీయ సమాగమయైన యొక నాయికతో శృంగా

మన్యో రసభంగ హేతుః, పరిపోషం గతస్యాపి రసస్య పౌనఃపున్యేన దీపనం ఉపభుక్తోహి రసః స్వసామగ్రీ లబ్ధ పరిపోషః పునః పునరామృష్యమాణః పరిమ్లాన కుసుమ కల్పః కల్పతే. వృత్తేః వ్యవహారస్య అనౌచిత్యమపి రసభంగ హేతుః యథా; నాయకంప్రతి నాయికాయాః కస్యాశ్చిత్ ఉచితాంగభంగి మంతరేణ స్వయం సంభోగాభిలాష కథనే; యదివా;వృత్తీనాం భరత ప్రసిద్ధానాం కైశిక్యాదీనాం అవిషయే నిబంధనం రసభంగ హేతుః.

ఏవమేషాం రస విరోధినాం అన్యేషాంచ అనయా దిశా స్వయ ముత్ప్రేక్షితానాం పరిహారే సత్కవిభిః అవహితైర్భవితవ్యం. రసాదయః సుకవీనాం ముఖ్య వ్యాపార విషయాః. తేషాం నిబంధనే కవిభిరప్రమా దిభిః భావ్యం. నీరసస్తు ప్రబంధః కవేః అపశబ్దో మహాన్, స తేన అకవి రేవ స్యాత్ పూర్వే విశృంఖలగిరః కవయః ప్రాప్త కీర్తయః తానాశ్రిత్య నైషా నీతిః త్యాజ్యా.

---

రము పర పరిపోష పదవి నొందినను పరస్పరానురాగము సువిదిత మైనను, సమాగమోపాయ చింతా సముచిత మైన వ్యవహారమును విడచి స్వతంత్ర ముగా వ్యాపారాంతరమును వర్ణించుట. రెండవది యిట్లుండును వివిధ వీర వినాశ మతిశయించి కల్పాంత సంక్షయ కల్ప మయిన మహాసంగ్రామము ప్రవృత్తము కాగా నాయకుడు దేవప్రాయు డైనను విప్రలంభ శృంగార ముపక్రాంతము కా నపుడు తగిన నిమిత్తము లేకనే శృంగార కథావతార మును వర్ణించుట.

౪. ఇది వేరొక రసభంగహేతువు. రసము పరిపోషము పొందినను పౌనఃపున్యమున, దీపింప జేయుట. స్వసామగ్రిచే పరిపోషము చక్కగా పొంది యనుభూత మైన రసము మరల మరల నామృష్యమాణ మగునేని పరిమ్లాన కుసుమ సమమై తీరును

౫. వ్యవహారానౌచిత్యమును రసభంగ హేతువు. దీనినే వృత్త్య నౌచిత్య మందురు. నాయిక యొక తెను నాయకుని విషయమై తగిన యంగ భంగి విలాసములు లేకుండగనే స్వయముగా సంభోగాభిలాష యున్నట్లు చెప్పుట. వృత్త్యనౌచిత్యమును వేరొక విధముగా కూడ చెప్ప వచ్చును. భరత గ్రంథాదులలో ప్రసిద్ధము లైన కైశికీ భారతీ సాత్వతీ ఆరభటీ, వృత్తుల నవిషయమున నిబంధించుటయు రసభంగ హేతువు.

వివక్షితే రసే స్వసామగ్రీ లబ్ధ పరిపోషే, విరోధి రసాంగానాం బాధ్యానా మంగ భావం వా ప్రాప్తానాం సతాముక్తిరదోషా. తేషాముక్తిః ప్రస్తుతరసపరిపోషాయ సంపద్యతే. అంగభావం ప్రాప్తానాం విరోధినాముక్తౌ అవిరోధో యథా; విప్రలంభ శృంగారే వ్యాధ్యాదీనాం తదంగానామేవాదోషః. న అతదంగానాం. తదంగత్వే సంభవత్యపి మరణస్య ఉపన్యాసో న న్యాయ్యః. ఆశ్రయ విచ్ఛేదే రసస్య అత్యంతవిచ్ఛేదాపత్తేః యత్ర కరుణస్య కావ్యార్థత్వం తత్ర అవిరోధః. మరణస్య అదీర్ఘకాల ప్రత్యాపత్తి సంభవే శృంగారేపి కదాచిదుపనిబంధో నాత్యంతవిరోధీ. దీర్ఘకాల ప్రత్యాపత్తౌ తస్య అంతరా ప్రవాహవిచ్ఛేదః. ఇయం చ అంగభావ ప్రాప్తిరన్యా యదాధికారికత్వాత్ 'ప్రధానే ఏకస్మిన్ వాక్యార్థే రసయో ర్భావయోర్వా పరస్పరవిరోధినోర్ద్వయోరంగభావ గమనం తస్యామపి న దోషః. యథా క్షిప్తోహస్తావలగ్నః ఇత్యాదౌ. అత్ర శ్లోకే త్రిపురరిపు

---

ఇట్టి రసవిరోధులను ఇంక నిట్టి వానిని నీ సూచికచే స్వయముగా నుత్ప్రేక్షించిన వానిని పరిహరించుటలో సత్కవులు సావధానులు గావలయును. సుకవులకు రసాదులు ముఖ్యవ్యాపార విషయములు. వాని నిబంధనమున కవు లప్రమత్తులు గావలయును. కవి యగు వానికి నీరస మగు ప్రబంధము "మహాన్ అపశబ్దః" కవిత్వమైన నాతడకవియే యగును. ప్రాచీనులు కొందఱిట్లే చేసిన వారు కా వచ్చును. ఆ కవులు విశృంఖల వాక్కులు, ప్రాప్తకీర్తులు. వారి నాశ్రయించి యీ నీతిని త్యజింపరాదు.

వివక్షిత రసము స్వ సామగ్రీ లబ్ధ పరిపోషము కాగా విరోధి రసాంగములను బాధ్యము లగునట్లుగా నిరూపించినను నంగభావము పొందినట్లుగా నిరూపించినను దోషము లేదు. అట్టివాని నిరూపణము ప్రస్తుతరస పోషమునకే సంపన్నమగును. అంగభావము పొందిన విరోధుల చెప్పుటలోనే విరోధమును లేదు. జూడుడు. విప్రలంభ శృంగారములో వ్యాధ్యాదులు తదంగములుగా నుండునేని యేమియు దోషము లేదు. అట్లు కాదేని దోషమే యగును. తదంగత్వము సిద్ధించినను మరణోపన్యాసము న్యాయ్యము కాదు. ఆశ్రయము విచ్ఛిన్న మైనచో రసమున కత్యంతము విచ్ఛేద మాపన్నమగును. అట్టి స్థలములందు కరుణమే కావ్యార్థ మగునేని మరణోపన్యాసము విరుద్ధము కాదు. అచిర కాలమున ప్రత్యాపత్తి సంభవించునేని శృంగా

ప్రభావాతిశయస్య వాక్యార్థత్వాత్ తదంగత్వేన ఈర్ష్యావిప్రలంభశృంగారకరుణయోః వ్యవస్థానం ఇతి న దోషః. కిం చ నాయకస్య అభినందనీయోదయస్య కస్యచిత్ప్రభావాతిశయవర్ణనే తత్ప్రతిపక్షాణాం యః కరుణో రసః స పరీక్షకాణాం న వైక్లవ్యమాదధాతి. ప్రత్యుత ప్రీత్యతిశయనిమిత్తతాం ప్రతిపద్యతే. ఇత్యతః తస్య కుంఠశక్తికత్వం. అతో న దోషః. తస్మాత్ వాక్యార్థీభూతస్య రసస్య భావస్య విరోధీ స రసవిరోధీ. న త్వంగభూతస్య కస్యచిత్, అథవా వాక్యార్థీభూతస్యాపి కస్యచిత్కరుణరసవిషయస్య తాదృశేన శృంగారవస్తునా భంగివిశేషాశ్రయేణ సంయోజనం రసపరిపోషాయైవ జాయతే. యతః ప్రకృతిమధురాః పదార్థాః శోచనీయతాం ప్రాప్తాః ప్రాగవస్థాభావిభిః సంస్మర్యమాణైర్విలాసైరధికతరం శోకావేగముపజనయంతి.

---

రమున కూడ మరణము నొకప్పు డుపనిబంధించుట యత్యంతము విరోధి గాదు. దీర్ఘ కాలమున ప్రత్యాపత్తి యగునేని రసమునకు మధ్యలో ప్రవాహవిచ్ఛేదము సంభవించును.

ఈ చెప్పినది వేరొక యంగభావము. ఆధికారికమై యుండగా నొక వాక్యార్థము ప్రధానమై యున్నపుడు పరస్పర విరుద్ధము లయినను రెండు రసములకు గాని, రెండు భావములకు గాని యంగభావ మున్నచో దోషము లేదు. "క్షిప్తో హస్తావలగ్నః" యను పద్యమున నిది స్పష్టము. దీనిలో త్రిపురరిపు ప్రభావాతిశయము ప్రధాన వాక్యార్థము. ఈర్ష్యావిప్రలంభ శృంగారము, కరుణమును తదంగములుగా నున్నవి. ఇట్టి వాని వ్యవస్థాన మిచట దోషము కాదు. అదియు గాక అభినందనీయోదయు డయిన యొక నాయకుని ప్రభావాతిశయ వర్ణనమున నాతని ప్రతిపక్ష వీరులకు సంబంధించిన కరుణ రసము సహృదయ పరీక్షకులకు వైక్లవ్య మాధానింపదు. విశేషించి ప్రీత్యతిశయనిమిత్తమే యగును. కాన నది కుంఠశక్తిక మగుచున్నది. అందుచే నేమియు దోషము లేదు. కావున విరోధి యనగా వాక్యార్థభూత మగు రసమునకు గాని భావమునకు గాని విరోధి యయినదే రసవిరోధి యగును. అంగ భూతములగు రసభావ ములకు విరోధి యయినను రసవిరోధి యనరు. వేరొక విధమున గూడ నిది సమాధేయము. ఒక కరుణ రస విషయము వాక్యార్థీభూతమై యున్నను యట్టి కరుణమునకు భంగివిశేషము ననుసరించిన నొక రమణీయమగు శృంగారవస్తువుతో

యథా; అయం స రశనోత్కర్షీ పీనస్తన విమర్దనః
నాభ్యూరు జఘన స్పర్శీ నీవీ విస్రంసనః కరః.

ప్రబంధానాం నానారసనిబంధనే ప్రసిద్ధేపి యః కవిః ప్రబంధానాం ఛాయాతిశయమిచ్ఛతి తేన తేషాం రసానా మన్యతమః కశ్చిత్ వివక్షితో రసః అంగిత్వేన వినివేశితవ్యః. స్థాయిత్వేన అవభాసినః ప్రస్తుతస్య రసస్య రసాంతరై రంతరాలవర్తిభిః సమావేశః నాంగితాముపహంతి. సంధ్యాదిమయస్య ప్రబంధశరీరస్య యథా కార్యమేక మనుయాయి వ్యాపకం కల్ప్యతే తథైవ రసస్యాప్యేకస్య సంనివేశే క్రియమాణే విరోధో న కశ్చిత్ ప్రత్యుత ప్రత్యుదితవివేకానామనుసంధానవతాం సచేతసాం తథావిధే విషయే ప్రహ్లాదాతిశయః ప్రవర్తతే.

---

సంయోజన ముండుట రసపరిపోష మునకె యగును. ప్రకృతి మధురము లగు పదార్థములు శోచనీయము లగుచో ప్రాగవస్థా భావులయిన నానా విలాసములను స్మృతి కందించును. ఇక నవి యత్యధికముగా శోకావేగ మును గలుగజేయును. ఉదా:-

భారత యుద్ధమున భూరిశ్రవసుని ఛిన్నహస్తము చూచి ప్రియురాండ్రిట్లు విలపించుచున్నారు. ఆ యీ కరము జఘన రశనల నాకర్షించినది. పీన కుచ విమర్దనము చేసినది. నాభి-ఊరు-జఘనముల స్పృశించినది. నీవి జార్చినది. ఇందు విలపించు వనితల కరుణ పరిదేవనమె ముఖ్యము. అది పూర్వ విలాస విశేషముల స్మరింప జేసినది. వారి కధిక శోకావేశము కలుగ జేసినది. ప్రబంధముల నానారసబంధము ప్రసిద్ధమైనను ప్రబంధములకు ఛాయాతిశయ మభిలషించు కవి రసములలో వివక్షితమగు నొక రసము నంగిగా సన్నివేశింప జేయవలయును. స్థాయిగా నవభాసించు ప్రస్తుత రసమున కంతరాలమున నుండు రసాంతరములతో సమావేశ మంగిత్వమును హతము చేయ జాలదు. సంధి సంధ్యంగమయమైన దృశ్య ప్రబంధ శరీరమున కావ్యమొకటియే యనుయాయియై, వ్యాపకమై సర్వగతమై యుండును. అట్లే యొక రససన్నివేశ మొనర్చునప్పుడు విరోధ ముండదు. అది యొకటియే యనుగతమై వ్యాపక మగును. విరోధ ముండదు. ఇంకను వివేకసముదయము కలిగిన యనుసంధాన చతురులైన సచేతసుల కట్టివిషయమున ప్రహ్లాదాతిశయమే ప్రవృత్తమగును.

౧ రసాంతరే అంగిని శృంగారాదౌ ప్రబంధవ్యంగ్యే సతి అవిరోధీ విరోధీ వా రసః పరిపోషం న నేతవ్యః. విరోధిరసస్య అంగిరసాపేక్షయా అత్యంతమాధిక్యం న కర్తవ్యం. ఉత్కర్షసామ్యేపి తయోర్విరోధాసంభవాత్.

౨. అంగిరస విరుద్ధానాం వ్యభిచారిణాం ప్రాచుర్యేణావివేశనం. నివేశనే వా క్షిప్రమేవ అంగిరసవ్యభిచార్యనువృత్తిః.

3 పరిపోషం నీయమానస్యాపి అంగభూతస్య రసస్య అంగత్వేన పునః ప్రత్యవేక్షా కర్తవ్యా. అనయా దిశా అన్యేపి ప్రకారా ఉత్ప్రేక్షణీయాః విరోధినస్తు రసస్య అంగిరసాపేక్షయా న్యూనతా సంపాదనీయా. యథా శాంతే అంగిని శృంగారస్య శృంగారే వా శాంతస్య. అంగినో హి రసస్య యావాన్పరిపోషః తావాంస్తస్య న కర్తవ్యః, స్వగతస్తు సంభవి పరిపోషః న వార్యతే. బహురసేషు ప్రబంధేషు ఏకస్య రసస్య ఏతదాపేక్షికం ప్రకర్షయోగిత్వం అశక్యప్రతిక్షేపం ఏవమయమవిరోధోపాయః ప్రతిపాదితః.

---

౧. శృంగారాది రస మంగియై ప్రబంధవ్యంగ్యమై యుండగా నవిరోధి రసమును గాని విరోధి రసమును గాని పుష్కల పరిపోష ముండు నట్లుగా చేయరాదు. అంగిరసము కన్న విరోధిరసమున కత్యంత మాధిక్యము కూర్పరాదు. ప్రస్తుత రసమునకు విరోధి రసమునకు నుత్కర్ష సామ్యమున్నను వాని కచట విరోధము సంభవింపదు.

౨ అంగిరస విరుద్ధము లగు వ్యభిచారి భావములను ప్రచురముగా కూర్పరాదు. కొంతగా వానికి నివేశమున్నను వెంటనే యంగిరస వ్యభిచారులనుగా పరిణమింప చేయవలయును.

3. అంగభూత మగు రసము స్వ స్వ సామగ్రీ వశమున పరిపోషము పొందినది యైనను నది యంగముగా నుండు నట్లే మరల ప్రత్యవేక్షణ మొనరింప వలెను. ఈ మార్గము ననుసరించి యితర ప్రకారములను గూడ నుత్ప్రేక్షించ వలెను. విరోధి రసమున కంగి రసమున కన్న న్యూనతవే సంపాదింప వలయును. శాంతరస మంగి యయి నపుడు శృంగారమునకు న్యూనతను జెప్పుట, శృంగార మంగి యయి నపుడు శాంతమునకు న్యూనతను జెపుటయు నావశ్యకము. అంగిరస మునకు గల పరిపోషము నంగరస మునకు గలుగ జేయ రాదు. ఆ యా రసగతముగా సంభవించు పరిపోష

ఐ కాధికరణ్యావిరోధీ నైరంతర్య విరోధీతి ద్వివిధో విరోధీ, విరుద్ధై కాశ్రయో యో విరోధీ యథా వీరేణ భయానకః సః ప్రబంధస్థేన స్థాయినా అంగినా రసేన ఔచిత్యాపేక్షయా విభిన్నాశ్రయః కార్యః తస్య వీరస్య య ఆశ్రయః కథానాయకః తద్విపక్షవిషయే స సన్నివేశయితవ్యః, తథా సతి చ తస్య విరోధినోపి యః పోషః స నిర్దోషః. విపక్షవిషయే హి భయాతిశయవర్ణనే నాయకస్య నయపరాక్రమాదిసంపత్ సుతరాముద్యోతితా భవతి. యః ఏవ రేకాధికరణత్వే నిర్విరోధః, నైరంతర్యే తు విరోధవాన్ స రసాంతరవ్యవధానేన ప్రబంధే నివేశయితవ్యః అవిరుద్ధరసవ్యవధానేన ప్రబంధే విరోధిరససమావేశే సత్యపి నిర్విరోధత్వం రసాంతరవ్యవహితయోః ఏకప్రబంధస్థయోరపి విరుద్ధయోః విరోధితా నివర్తతే. శాంతశృంగారయోరంతరాళే అద్భుతః, నివేశనీయః, తథా శృంగారబీభత్సయోః తదంగయోర్వా వీరరసవ్యవధానేన సమావేశః న విరోధీ.

---

మును నివారించుట లేదు. రసత్వ సిద్ధికి తగిన పరిపోష ముండవచ్చును. నానారసములు గల ప్రబంధము లందు రస మొక్కటి ప్రకర్ష కలిగి యుండుట యాపేక్షికము. ఒకదాని కన్న మరియొకటి ప్రకర్ష కలది యగుట యవశ్య ముండి తీరును. దాని కాదనుట శక్యము కాదు. ఇంత వర కిట్లి యవిరోధోపాయము ప్రతిపాదిత మయినది.

ఐకాధికరణ్య విరోధి, నైరంతర్య విరోధి యని విరోధి రెండు విధములు. మొదటి దాని నేకాశ్రయ విరోధ మందురు. ఒకే వ్యక్తి యాశ్రయముగా నున్నందున రసములకు గలుగు విరోధ మేకాశ్రయ విరోధము. వీరాశ్రయమయిన వ్యక్తియందు భయానకము విరుద్ధైకాశ్రయ విరోధి. ప్రబంధగతము స్థాయి యంగియగు రసము ననుసరించిన యౌచిత్యమును బట్టి యా విరోధిని విభిన్నాశ్రయముగా నొనరించుట యుక్తకార్యము. కథానాయకుడు వీరమున కాశ్రయమగు నేని తద్విపక్ష విషయముగా భయానకమును సన్నివేశింప జేయ వలెను. అట్లయినచో నపుడు ఆ విరోధి పోషముకూడ నిర్దోషమె యగును. విపక్షవిషయముగా భయాతిశయమును వర్ణించినచో నాయకుని నయ పరాక్రమాది సంపద యత్యంతము ద్యోతిత మగును.

యథో క్తలక్షణానుసారేణ విరోధం అవిరోధం చ సర్వేషు రసేషు ప్రబంధే అన్యత్ర చ నిరూపయేత్సహృదయః. విశేషతస్తు శృంగారే తస్య రతిపరిపోషాత్మకత్వాత్, రతేశ్చ స్వల్పేనాపి నిమిత్తేన భంగసంభవాత్ శృంగారః సుకుమారతరః, సర్వేభ్యో రసేభ్యః స మనాగపి విరోధిసమావేశం న సహతే. తత్రైవ చ రసే కవిః ప్రయత్నవాన్ స్యాత్, తత్ర హి ప్రమాద్యత స్తస్య సహృదయమధ్యే క్షిప్రమేవ అవజ్ఞానవిషయతా భవతి. శృంగారరసో హి సంసారిణాం నియమేన అనుభవవిషయత్వాత్ సర్వ రసేభ్యః కమనీయతయా ప్రధానభూతః

---

ఏకాధికరణత్వమున విరోధి కాక నైరంతర్యమున విరోధి యగు రసమును రసాంతర వ్యవధానమున ప్రబంధమున గూర్ప వలెను. ప్రబంధమున విరోధి రస సమావేశ మున్నను ఆ విరోధి రసము లవిరుద్ధ రసముచే వ్యవహితము లయినచో విరోధ ముండదు. రసాంతర వ్యవధాన మున్నచో నేక ప్రబంధగతము లయిన విరుద్ధము లకును విరోధిత నివృత్త మగును. ఈ విషయమున నెవరికి నెట్టి భ్రాంతియు నక్కర లేదు. ఏక వాక్యస్థము లయిన రసములకును ఈ చెప్పిన నీతి ననుసరించినచో విరోధిత పోవును. శాంతశృంగారముల యంతరాళమునం దద్భుతమును గూర్పవలెను. శృంగార బీభత్సములను వీరరస వ్యవధానమున సమావేశింప జేయుట విరోధి కానేరదు.

సహృదయు డగువాడీ నిరుక్త లక్షణానుసారముగా విరోధము నవిరోధమును సర్వరసములందును ప్రబంధమున గాని యితరమున గాని నిరూపింప దగును. రతి పరిపోషాత్మక మయిన దగుట విశేషముగా శృంగారమున నిది యవసరము. విరుద్ధమగు స్వల్పనిమిత్త మున్నను రతికి భంగము సంభవించును సర్వరసముల కన్న శృంగారము సుకుమారతరము. అది యే మాత్రమును విరోధి సమావేశమును సహింపదు. అచటనే కవి యత్యంతము సావధానుడు కా వలయును. శృంగార విషయమున నాతడు ప్రమాద పడునేని సహృదయ మధ్యమున వెంటనే యవజ్ఞానిత కలిగి తీరును. సంసారుల కందరకును శృంగార మనునది నియమముగా ననుభవమున నుండునది. అందుచే నితర సర్వరసముల కన్న కమనీయము ప్రధానమును. కనుకనే యవధాన మపేక్షితము.

శృంగారరసాంగాణాం శృంగారవిరుద్ధరసస్పర్శః యః స న కేవల మవిరోధలక్షణయోగే సతి దుష్యతి, యావత్ వినేయానున్ముఖీకర్తుం కావ్య శోభార్థమేవ వా క్రియమాణః న దుష్యతి. శృంగారరసాంగైరున్ముఖీకృతాః సంతో హి వినేయాః సుఖం వినయోపదేశం గృహ్ణంతి. సదాచారోపదేశ రూపా హి నాటకాదిగోష్ఠీ వినేయజనహితార్థమేవ మునిభి రవతారితా. కించ శృంగారస్య సకలజనమనోభిరామత్వాత్ తదంగసమావేశః కావ్య శోభాతిశయం పుష్యతీత్యనేనాపి ప్రకారేణ విరోధరసే శృంగారాంగ సమావేశః న విరోధీ.

విజ్ఞాయేత్థం రసాదీనాం అవిరోధవిరోధయోః
విషయం సుకవిః కావ్యం కుర్వన్ముహ్యతి న క్వచిత్.

వాచ్యానాం వాచకానాం చ రసాదివిషయేణ ఔచిత్యేన యోజనం తన్మహాకవేః ముఖ్యం కర్మ. అయమేవ హి మహాకవేః ముఖ్యో వ్యాపారః యద్రసాదీనేవ ముఖ్యతయా కావ్యార్థీకృత్య తద్వ్యక్త్యనుగుణత్వేన శబ్దానాం అర్థానాం చోపనిబంధనం. రసానుగుణః ఔచిత్యవాన్ వాచ్యా శ్రయో యో వ్యవహారః తా ఏతాః కైశిక్యాద్యా వృత్తయః. వాచకా

---

శృంగార రసాంగ ములకు శృంగార విరుద్ధ రస స్పర్శ దోష యుక్తము కాక పోవుట యింతవరకు నిరూపిత మైనది. అది యట్లు దుష్టము కాక పోవుటమో కేవలము విరోధిలక్షణ యోగ ముండుటయే కాదు. వినేయుల నున్ముఖీకరించుట గాని కావ్య శోభార్థమునకు గాని శృంగార విరుద్ధ రస స్పర్శయున్నను దుష్టము కాదు. వినేయులు శృంగార రసాంగములచే నౌన్ముఖ్యము పొందిన వారై సుఖముగా వినయోపదేశమును గ్రహింతురు. సదాచారోపదేశ రూప మైన నాటకాది గోష్ఠిని, వినేయ జనహితము కొరకై మును లవతరింప జేసినారు. శృంగారము సకల జన మనోభిరామ మగుట వలన తదంగ సమావేశము కావ్యశోభాతిశయమును పోషించునది కాగలదు. ఇట్టి ప్రకారమున కూడ శృంగారాంగ సమావే శము విరోధి కాదు. రసాదులకు సంబంధించిన విరోధావిరోధ విషయము లను సుకవి యీ విధమున గుర్తించి కావ్యకరణమున నుద్యుక్తు డగునేని ఎచ్చటను వ్యామోహము పొందడు. వాచ్యవాచక ములను, రసాదివిష యౌచిత్యము ననుసరించి కూర్చుట మహాకవికి ముఖ్యకర్మ. ఇదియే కవికి

శ్రయాశ్చ ఉపనాగరికాద్యాః వృత్తయో హి రసాదితాత్పర్యేణ సంనివే
శితాః కామపి నాట్యస్య కావ్యస్య చ ఛాయామావహంతి. రసాదయో
హి ద్వయోరపి తయోర్జీవభూతాః. ఇతివృత్తాది తు శరీరభూతమేవ అతః
రసాదీనాం ఇతివృత్తాదిభిస్సహ జీవశరీరవ్యవహార ఏవ న గుణగుణివ్యవహారః
న హి విభావానుభావవ్యభిచారిణ ఏవ రసా ఇతి కస్యచిదవగమః. అతఏవ
చ విభావాదిప్రతీత్యవినాభావినీ రసాదీనాం ప్రతీతిరితి తత్ప్రతీత్యోః కార్య
కారణభావేన వ్యవస్థానాత్క్రమోఽవశ్యంభావీ. స తు లాఘవాన్న
ప్రకాశతే. క్వచిత్తు లక్ష్యత ఏవ. యథా అనురణనరూపవ్యంగ్యప్రతీతిషు.
అభిధానాభిధేయప్రతీత్యోరివ వాచ్యవ్యంగ్యప్రతీత్యోః నిమిత్తనిమిత్తిభావా
న్నియమభావీ క్రమః. సతూక్తయుక్త్యా క్వచిల్లక్ష్యతే - క్వచిన్నలక్ష్యతే.

---

ముఖ్యవ్యాపారము. రసాదులనే ముఖ్యముగా కావ్యార్థములనుగా చేసి తద్వ్యక్త్యనుగుణముగా శబ్దముల నర్థముల నుపనిబంధించుట కన్న కవి యొనరింప వలసినది యుండదు. రసానుగుణ మౌచిత్యయుతము వాచ్యాశ్రయ యుతమగు వ్యవహారము కైశిక్యాదివృత్తిరూపమని యందురు. వాచకాశ్రయమైన వ్యవహార ముపనాగరికాది వృత్తిరూపము. వాచ్యవాచక వృత్తులను రసాది తాత్పర్యమున సన్నివేశింప జేసినచో నాట్యమునకు కావ్యమునకు నిరతిశయ చ్ఛాయా విశేషము కలుగును. నాట్య కావ్యముల రెండింటికిని రసాదులు జీవభూతములు. ఇతివృత్తాదికము శరీరప్రాయమే యని నిశ్చయము.

రసాదుల కితివృత్తాదులతో జీవ శరీర వ్యవహారమే యున్నది గాని గుణ గుణి వ్యవహారము లేదు. విభావానుభావ వ్యభిచారులే రసము లని ఎవ్వరును తలచరు. కావుననే విభావాది ప్రతీత్యవినాభావియై రసాదిప్రతీతి యుండును. విభావాది ప్రతీతికిని, రసాది ప్రతీతికిని కార్య కారణ భావము వ్యవస్థితమై యున్నది. కావున వానికి క్రమ మవశ్యం భావ్యము. ఆ క్రమ మత్యంతము లఘుప్రాయ మగుట సుప్రకాశము కాదు. ఒక్కొకచో నది స్పష్టలక్ష్య మగును. అనురణన రూప వ్యంగ్య ప్రతీతులలో క్రమము సుగోచరము. అభిధానాభిధేయ ప్రతీతులలో క్రమ మున్నట్లుగా వాచ్యవ్యంగ్య ప్రతీతు లందును కలదు. అంతట నీ నీ నిమిత్త నిమిత్తి భావ ముండుట వలన క్రమము నియమభావి. చెప్పిన విధమున నా క్రమ మొకచో లక్షిత

పరినిశ్చిత నిరపభ్రంశ శబ్దబ్రహ్మణాం విపశ్చితాం మతమాశ్రిత్యైవ ప్రవృత్తోఽయం ధ్వనివ్యవహారః. తథైవ వ్యంజకత్వం వాచకానాం శబ్దానాం, అవాచకానాం చ గీతధ్వనీనాం, అశబ్దరూపాణాం చ చేష్టాదీనాం యత్సర్వేషామనుభవసిద్ధం తత్కేనాపహ్నూయతే? అశబ్దమర్థం రమణీయం హి సూచయంతః వ్యాహారాః తథా వ్యాపారనిబంధాశ్చ విదగ్ధపరిషత్సు వివిధా విభావ్యంతే. కావ్యవిషయే చ వ్యంగ్యప్రతీతీనాం సత్యాసత్యత్వనిరూపణస్య అప్రయోజకత్వమేవేతి తత్ర ప్రమాణాంతరవ్యాపారపరీక్షా ఉపహాసాయైవ సంపద్యతే.

## గుణీభూతవ్యంగ్యః

లలనాలావణ్యప్రఖ్యః వ్యంగ్యార్థో యః ప్రతిపాదితః తస్య ప్రాధాన్యే ధ్వనిరిత్యుక్తం. తస్యైవ గుణీభావేన వాచ్యచారుత్వప్రకర్షే గుణీభూతవ్యంగ్యో నామ కావ్యభేదః ప్రకల్పతే. రసాదిరూపవ్యంగ్యస్య గుణీభావే రసవదలంకారో దర్శితః. తత్ర చ తేషామాధికారికవాక్యాపేక్షయా గుణీభావః. వివాహప్రవృత్త భృత్యానుయాయి రాజవత్. వ్యంగ్యాలంకారస్య గుణీభావే దీపకాదిర్విషయః.

ప్రసన్నగంభీరపదాః కావ్యబంధాః సుఖావహాః
యే చ తేషు ప్రకారోఽయం ఏవం యోజ్యః సుమేధసా.

---

మగును. ఒకచో లక్షితము కాదు.

నిరపభ్రంశ శబ్దబ్రహ్మ ననుసంధానముచేసి పరినిశ్చిత విజ్ఞానులైన విద్వాంసుల మతము ననుసరించియే ఈ ధ్వనివ్యవహారము ప్రవర్తించినది. వాచకములగు శబ్దములకును, అవాచకములగు గీతధ్వనులకును, అశబ్దములైన చేష్టాదులకును వ్యంజకత్వ మున్నది. ఇది అందర కనుభవసిద్ధము. ఎవరు దీనిని అపలాపము చేయగలరు? విదగ్ధపరిషత్తులలో అశబ్ద మగు రమణీయార్థమును సూచనము చేయు వ్యాహారములు వ్యాపారనిబంధములును వివిధములుగా నుండును. కావ్యవిషయమునందు వ్యంగ్యప్రతీతుల సత్యాసత్యత్వనిరూపణ మప్రయోజకము. అందు ప్రమాణాంతర వ్యాపార పరీక్ష పరిహాసాస్పద మగును.

## గుణీభూతవ్యంగ్యము

లలనా లావణ్య ప్రఖ్యమైన వ్యంగ్యార్థ మింతదనుక ప్రతిపాదిత

యే చైతే పరిమితస్వరూపా అపి ప్రకాశమానా స్తథా రమణీయాః సంతో వివేకినాం సుఖావహాః కావ్యబంధాః తేషు సర్వేష్వేవాయం ప్రకారః గుణీభూతవ్యంగ్యో నామ యోజనీయః. అయం వాచ్యాలంకార వర్గః వ్యంగ్యాంశానుగమే సతి ఛాయాతిశయం బిభ్రత్ దర్శితః. దీపకసమాసోక్త్యాదివత్ అన్యేప్యలంకారాః ప్రాయేణ వ్యంగ్యాలంకార వస్త్వంతర సంస్పర్శినః దృశ్యంతే. యతః ప్రథమం తావత్ అతిశయోక్తిగర్భతా సర్వాలంకారేషు శక్యక్రియా కృతైవ చ సా మహాకవిభిః కామపి కావ్యచ్ఛవిం పుష్యతీతి కథం హి అతిశయయోగితా స్వవిషయౌచిత్యేన క్రియమాణా

---

మైనది. అది ప్రధానమైనచో ధ్వని యనియు నిరూపితము. ఆ వ్యంగ్యము గుణీభావము పొందగా వాచ్యచారుత్వమునకు ప్రకర్ష కలుగగా గుణీభూత వ్యంగ్య మను పేరు గల కావ్యభేదము కలుగును. రసాది రూప వ్యంగ్యము గుణీభావము పొందినచో రసవదలంకార మని ప్రదర్శితమే. అచట నా రసముల కాధికారికము కన్న గుణీభావ మనునది వివాహ ప్రవృత్తు డైన భృత్యు ననుసరించు రాజు వలె నుండు నని యూహింప వలెను. వ్యంగ్యాలంకారమునకు గుణీభావము కల్గినచో నది దీపకాద్యలంకారములకు విషయ మగును.

ప్రసన్న గంభీర పదములు సుఖావహములు నగు కావ్యబంధములు కలవు. వాని యందు గుణీభూత వ్యంగ్య ప్రకారమునే బుద్ధిమంతు లాయోజనము చేయవలెను. పరిమిత స్వరూపము లయ్యును ప్రకాశమానము లగుచు రమణీయములై వివేకులకు సుఖావహము లైన కావ్యబంధము లెన్నియో కలవు. వాని యందన్నిటను గుణీభూత వ్యంగ్యప్రకారమే యోజనీయము. వ్యంగ్యాంశానుగుణము కలుగగా వాచ్యాలంకార వర్గము ఛాయాతిశయము ధరించు చున్నటులు గోచరించుచునే యున్నది. దీపక సమాసోక్త్యాదుల వలె నితరాలంకారములును సామాన్యముగ వ్యంగ్యాలంకారమును, వస్త్వంతరమును స్పృశించునవిగనే కన్పడు చున్నవి. సర్వ సామాన్యముగా నన్ని యలంకారము లందును నతిశయోక్తి గర్భత శక్య క్రియగనే యున్నట్లు ప్రథమముననే గోచరించును. మహాకవుల యతిశయోక్తి గర్భతను నిరూపించినచో నది చక్కని కావ్యచ్ఛవిని పోషించును. స్వవిషయౌచిత్యానుసారమున కూర్పుపొందిన యతిశయోక్త్యలంకారము

సతీ కావ్యే నోత్కర్షమావహేత్. అతిశయోక్తిః యమలంకారమధితిష్ఠతి కవిప్రతిభావశాత్ తస్య చారుత్వాతిశయయోగః అన్యస్య తు అలంకారమాత్రతా. తస్యాశ్చ అలంకారాంతరసంకీర్ణత్వం కదాచిద్వాచ్యత్వేన కదాచిత్ వ్యంగ్యత్వేన. వ్యంగ్యత్వమపి కదాచిత్ప్రాధాన్యేన కదాచిద్గుణభావేన. తత్ర ఆద్యే పక్షే వాచ్యాలంకారమార్గః. ద్వితీయే ధ్వనావంతర్భావః. తృతీయే తు గుణీభూతవ్యంగ్యరూపతా అయం చ ప్రకారః అన్యేషామప్యలంకారాణా మస్తి. తేషాం న సర్వో విషయః, అతిశయోక్తేస్తు సర్వాలంకారేపి విషయస్సంభవతీత్యయం విశేషః.

యేషు చాలంకారేషు సాదృశ్యముఖేన తత్త్వప్రతిలంభః యథా; రూపకోపమా తుల్యయోగితా నిదర్శనాదిషు తేషు గమ్యమాన ధర్మ ముఖేనైవ యత్సాదృశ్యం తదేవ శోభాతిశయశాలి భవతీతి తే సర్వేపి చారుత్వాతిశయ యోగినస్సంతః గుణీభూత వ్యంగ్యస్యైవ విషయః. సమాసోక్తి-ఆక్షేప

---

కావ్యసముత్కర్ష నాపాదింపదేమి! అతిశయోక్తి యే యలంకారము నందనుగతమగునో యా యలంకారము కవిప్రతిభా వశమున చారుత్వాతిశయ యోగము కల దగును. అతిశయోక్తి యధిష్ఠింప కున్నచో నవి యలంకార మాత్రములే యగును.

ఆ యతిశయోక్తి యలంకారాంతర ములతో సంకీర్ణ మగుట యొకప్పుడు వాచ్యముగా నుండును. మరొకప్పుడు వ్యంగ్యముగా నుండును. వ్యంగ్యముగా నుండుటయు నొకచో ప్రధానముగా నుండును, మరియొకచో గుణభావమున నుండును. ఇందాద్య పక్షమున వాచ్యాలంకార వర్గమును ద్వితీయ పక్షమున ధ్వన్యంతర్భావమును, తృతీయపక్షమున గుణీభూత వ్యంగ్యరూపత్వము సిద్ధ మగుచున్నది. ఈ ప్రకార భేద మితరాలంకారములకును కలదు. కాని వానికి సర్వము విషయము కానేరదు. అతిశయోక్తి కలంకార సామాన్య మంతయు విషయమగుట యందలి విశేషము.

రూపకము, ఉపమ, తుల్యయోగిత, నిదర్శన మొదలగున లంకారములందు సాదృశ్యముఖమున తత్త్వప్రతిలంభ మున్నది. ఆ యలంకారములందు గమ్యమానధర్మ ముఖముగా భాసించు సాదృశ్యమే శోభాతిశయశాలి యగును. అప్పుడా యలంకారము లన్నియు చారుత్వాతిశయ యోగ

పర్యాయోక్తాదిషు తు గమ్యమానాంశావినాభావేనైవ తత్త్వవ్యవస్థానాద్గుణీభూతవ్యంగ్యతా నిర్వివాదైవ. తదేవం వ్యంగ్యాంశసంస్పర్శే సతి చారుత్వాతిశయయోగినః రూపకాదయో అలంకారాః సర్వ ఏవ గుణీభూతవ్యంగ్యస్య మార్గః. అనంతా హి వాగ్వికల్పాః. తత్ప్రకారా ఏవ చాలంకారాః తదయం ధ్వనినిష్యంద రూపః ద్వితీయోపి మహాకవివిషయః అతిరమణీయః లక్షణీయః సహృదయైః. సర్వథా నాస్త్యేవ సహృదయహృదయహారిణః కావ్యస్య స ప్రకారః యత్ర న ప్రతీయమానార్థసంస్పర్శేన సౌభాగ్యం. తదిదం కావ్యరహస్యం పరమితి సూరిభిర్విభావనీయం.

అలంకృతిభృతామపి మహాకవిగిరాం ఏషా ప్రతీయమానచ్ఛాయా యోషితాం లజ్జేవ ముఖ్యా భూషా. అనయా సుప్రసిద్ధోప్యర్థః కమపి కామనీయకమానీయతే. యా చైషా కాక్వా కాచిదర్థాంతరప్రతీతిః దృశ్యతే సా, వ్యంగ్యస్య అర్థస్య గుణీభావే సతి గుణీభావలక్షణం కావ్యప్రభేదమాశ్రయతే. శబ్దశక్తిరేవ కాకుసహాయా సతీ అర్థవిశేషప్రతిపత్తిహేతుః న కాకుమాత్రం స చార్థః అర్థసామర్థ్యరూప ఇతి వ్యంగ్యరూప ఏవ.

---

ములై గుణీభూతవ్యంగ్య మునకే విషయము లగును. సమాసోక్తి, ఆక్షేపము, పర్యాయోక్తము మొదలగు నలంకారములలో నలంకారత్వ మనునది గమ్యమానాంశావినాభావ మననే వ్యవస్థిత మగుచున్నది. కావున నచట నిర్వివాదముగా గుణీభూతవ్యంగ్యత్వమున్నదని నిశ్చయింపవచ్చును. వ్యంగ్యాంశ సంస్పర్శ యుండగా చారుత్వాతిశయము పొందినవై రూపకాద్యలంకారము లన్నియు గుణీభూతవ్యంగ్య మునకే మార్గముగా చెప్పదగి యున్నవి. వాగ్వికల్పము లనంతములు గదా! అలంకారము లన్నియు తత్ప్రకారములే. గుణీభూతవ్యంగ్యమన్న ఈ ద్వితీయభేదము ధ్వని నిష్యంద రూపము. ఇదియు మహాకవి విషయమై యతిరమణీయమై యున్నది. సహృదయులు చక్కగా దీని నుపలక్షింప వలయును. ప్రతీయమానార్థ సంస్పర్శ యున్నపుడు కావ్యమున సౌభాగ్య మవశ్య ముండితీరును. ధ్వని స్పర్శసౌభాగ్యము లేని కావ్యము సహృదయ హృదయహారి కాదు. ఆ సౌభాగ్యము లేక మనోహర మగు కావ్యప్రకార ముండనే యుండదు. ఇది కావ్యరహస్యము. ఇట్లే విద్వాంసులు విభావనము చేయ తగి యున్నది.

మహాకవి వాక్కు లలంకారములను ధరించినను నీ ప్రతీయమాన

వ్యంగ్యవిశిష్టవాచ్యాభిధాయినో హి గుణీభూతవ్యంగ్యత్వం. అస్య ప్రభేదస్య యశ్చ విషయః యుక్త్యా ప్రతీయతే సహృదయైస్తత్ర ధ్వనియోజనా న విధాతవ్యా. సఙ్కీర్ణో హి కశ్చిత్ ధ్వనేః గుణీభూతవ్యంగ్యస్య చ లక్ష్యే దృశ్యతే మార్గః తత్ర యస్య యుక్తిసహాయతా తత్ర తేన వ్యపదేశః కర్తవ్యః. న సర్వత్ర ధ్వనిరాగిణా భవితవ్యం యథా.

పత్యుః శిరశ్చంద్రకలామనేన స్పృశేతి సఖ్యా పరిహాసపూర్వం
సా రంజయిత్వా చరణౌ కృతాశీః మాల్యేన తాం నిర్వచనం జఘాన.

ఇత్యత్ర "నిర్వచనం జఘాన" ఇతి ప్రతిషేధముఖేన వ్యంగ్యస్యార్థస్య ఉక్త్యా కించిద్విషయీకృతత్వాత్ గుణీభావ ఏవ శోభతే. తస్మాత్ నాత్రానురణనరూప వ్యంగ్యధ్వని వ్యపదేశో విధేయః.

---

చ్ఛాయ యుండుట లలనలకు లజ్జవలె ముఖ్యమగు భూష. దీనిచే సుప్రసిద్ధమగు నర్థము కూడ కమనీయతాతిశయము కల దగును.

ఒక్కొక స్థలము నందు కాకు వను స్వరవిశేషముచే నొకానొక యర్థాంతర ప్రతీతి కన్పడు చున్నది. వ్యంగ్యమగు నర్థము గుణీభావము పొందగా గుణీభావ రూపమైన కావ్య ప్రభేదము నాశ్రయించి యా యర్థాంతర ప్రతీతి యుండును. శబ్దశక్తియే కాకు సహాయము కలదియై యర్థ విశేష ప్రతిపత్తిలో హేతు వగును. గాని కేవల కాకు మాత్రమే యిట్టిది కాజాలదు. అట్టి యర్థ మచట యర్థ సామర్థ్యరూపమే యగుట వ్యంగ్యరూపమే యగును. కాని వ్యంగ్య విశిష్టమగు వాచ్యమును చెప్పుదానికి గుణీభూత వ్యంగ్యత్వమునే యంగీకరింప వలయును. ఈ ప్రభేదమునకు విషయమై ప్రతీయమాన మగు నర్థము నందు సహృదయులు ధ్వని యోజనము చేయ నక్కర లేదు. ధ్వనికి గుణీభూత వ్యంగ్యమునకును మార్గము లక్ష్యము నందు సంకీర్ణమై గోచరించు చున్నది. అందే యర్థమునకు యుక్తి సహాయత యుండునో యచట నా విధముగా వ్యవహారము చేయవలయును. అంతట ధ్వనిరాగిత యే యక్కర లేదు. చూడుడు!

నీ పతి శిరశ్చంద్రకళ నీ పాదమున స్పృశింపు మని సఖి చరణములకు పారాణి పెట్టి పరిహాస పూర్వకముగా పలుకగా దేవి పార్వతి మాల్యమున నా సఖిని నిర్వచనముగా కొట్టెను."

ఇచట నిర్వచనముగా కొట్టుట యనునది నిర్వచనముగా కొట్టెనన్న

గుణీభూతవ్యంగ్యోప్యయం ప్రకారః రసాదితాత్పర్యపర్యాలోచనయా పునర్ధ్వనిరూపతాం ధత్తే. యథాత్రైవానంతరోదాహృతే శ్లోకే.

యత్ర తు వాక్యే రసాదితాత్పర్యం నాస్తి తత్ర గుణీభూతవ్యంగ్యతైవ సముదాయధర్మః యథా.

రాజానమపి సేవంతే విషమప్యుపభుంజతే
రమంతే చ సహ స్త్రీభిః కుశలాః ఖలు మానవాః,

ఇత్యాదౌ వాచ్యవ్యంగ్యయోః ప్రాధాన్యాప్రాధాన్యవివేకే పరః ప్రయత్నో విధాతవ్యః యేన ధ్వనిగుణీభూతవ్యంగ్యయోః అలంకారాణాం చ అసంకీర్ణో విషయః సుజ్ఞాతో భవతి. అన్యథా తు ప్రసిద్ధాలంకారవిషయ ఏవ వ్యామోహః ప్రవర్తతే. తస్మాద్వాచ్యవ్యంగ్యయోః ప్రాధాన్యాప్రాధాన్యే యత్నతో నిరూపణీయే.

ఏవం వ్యంగ్యస్య ప్రధాన గుణాభావాభ్యాం ఉభే కావ్యే వ్యవస్థితే.

---

ప్రతిషేధ ముఖమున వ్యంగ్యార్థము స్వోక్తిచే కొంతగా విషయీకృతమైనది. అందుచే నిచట గుణీభావమే శోభించును. కావున నీ స్థలము నందనురణన రూప వ్యంగ్య ధ్వని వ్యపదేశ మొనరింప రాదు.

ఈ ప్రకారము గుణీభూత వ్యంగ్యమైనను రసాది తాత్పర్య పర్యాలోచన మొనరించినచో మరల ధ్వనిరూపమే యగును. పూర్వోదాహృత శ్లోకము నందే దీనిని గుర్తింపవచ్చును.

ఏదేని వాక్యమున రసాది తాత్పర్యము లేక పోయినచో నచట గుణీభూతవ్యంగ్య మనియే సముదాయ ధర్మము. ఉదాహరణము:—

"రాజును కూడ సేవింతురు. విషమును కూడ భుజింతురు. స్త్రీలతో కూడ రమింతురు. మానవులు నేర్పరులు కదా!"

ఈ మొదలగు నుదాహరణము లందు వాచ్య వ్యంగ్యముల ప్రాధాన్యాప్రాధాన్య వివేకమున ప్రయత్న పరిశీలన మావశ్యకము. అపుడే ధ్వని గుణీభూత వ్యంగ్యములకును, నలంకారములకును నీసంకీర్ణమగు విషయము సుజ్ఞాత మగును. లేక పోయినచో ప్రసిద్ధాలంకార విషయమున గూడ వ్యామోహమే కలుగును. కావున వాచ్యవ్యంగ్యముల ప్రాధాన్యాప్రాధాన్యములను యత్నపూర్వకముగా నిరూపింప వలసినది.

ఇట్లు వ్యంగ్యమునకు సంబంధించిన ప్రధాన గుణ భావములచే రెండు

తతోఽన్యద్య త్తచ్చిత్రమభిధీయతే. శబ్దార్థభేదేన తద్ద్వివిధం. శబ్దచిత్రం వాచ్య చిత్రమితి.

వ్యంగ్యస్యార్థస్య ప్రాధాన్యే ధ్వనిసంజ్ఞితకావ్యప్రకారః గుణభావే తు గుణీభూతవ్యంగ్యతా. తతోఽన్యద్రసభావాది తాత్పర్యరహితం వ్యంగ్యార్థవిశేషప్రకాశన శక్తిశూన్యం చ కావ్యం కేవలవాచ్యవాచకమాత్రాశ్రయేణ ఉపనిబద్ధం ఆలేఖ్యప్రఖ్యం యదాభాసతే తచ్చిత్రం న తన్ముఖ్యం కావ్యం కావ్యానుకారో హ్యసౌ తత్ర కించిత్ శబ్దచిత్రం యథా దుష్కరయమకాది. వాచ్యచిత్రం తతశ్శబ్దచిత్రాదన్యత్. వ్యంగ్యార్థసంస్పర్శరహితం రసాది తాత్పర్యరహితం ఉత్ప్రేక్షాది.

అథ కిమిదం చిత్రంనామ? యత్ర వస్త్వలంకారాంతరం వా వ్యంగ్యం నాస్తి స నామ చిత్రస్య కల్ప్యతాం విషయః యత్ర తు రసాదీనామవిషయత్వం స కావ్యప్రకారో న సంభవత్యేవ. యస్మాత్ అవస్తుసంస్పర్శితా కావ్యస్య నోపపద్యతే. వస్తు చ సర్వమేవ జగద్గతం అవశ్యం కస్య చిద్రసస్య భావస్య వా అంగత్వం ప్రతిపద్యతే. అంతతో విభావత్వేన చిత్తవృత్తి విశేషా హి రసాదయః న చ తద స్తివస్తు కించిత్ యన్న చిత్తవృత్తివిశేషముపజనయతి. తదనుత్పాదనే వా కవివిషయతైవ తస్య న స్యాత్ కవివిషయశ్చ కశ్చిన్నిరూప్యతే చిత్రతయా.

---

కావ్యములు వ్యవస్థితము లగు చున్నవి. వీని కన్న వేరుగా నుండునది చిత్రమే యని చెప్పుదుము. ఆ చిత్రము శబ్దార్థభేదమున ద్వివిధము. శబ్ద చిత్ర మని, వాచ్యచిత్ర మని.

వ్యంగ్యార్థమునకు ప్రాధాన్య మున్నచో ధ్వని సంజ్ఞ కల కావ్య ప్రకారమును, గుణభావమున్నచో గుణీభూత వ్యంగ్యతయు ప్రసిద్ధము. అంతకన్న వేరుగా రసభావాది తాత్పర్యరహితము వ్యంగ్యార్థ విశేషమును ప్రకాశింప జేయుటలో శక్తిశూన్యమగు కావ్యము కేవలము వాచ్యవాచకాశ్రయమున నుపనిబద్ధమై యాలేఖ్య ప్రఖ్యమున నవభాసించును. అదియే చిత్రకావ్యము. అది ముఖ్యకావ్యము కాదు. అది కావ్యానుకారము. అందొకటి శబ్దచిత్రము. దుష్కర యమకాదు లట్టివి. వాచ్య చిత్ర మనునది శబ్దచిత్రమున కన్న నన్యము. వ్యంగ్యార్థ సంస్పర్శరహితమును రసాది తాత్పర్యరహితమును నగు నుత్ప్రేక్షాదికము వాచ్యచిత్రము.

అత్రోచ్యతే సత్యం—న తాదృక్కావ్యప్రకారోఽస్తి యత్ర రసాదీనామప్రతీతిః కిం తు యదా రసభావాదివివక్షాశూన్యః కవిః శబ్దాలంకారం వా అర్థాలంకారం వా ఉపనిబధ్నాతి, తదా తద్వివక్షాపేక్షయా రసాదిశూన్యతా అర్థస్య పరికల్ప్యతే. రసభావాదివిషయవివక్షావిరహే అలంకారనిబంధో యః స చిత్రవిషయః. యదా రసాదిషు తాత్పర్యవతీ వివక్షా స్యాత్ తదా నాస్త్యేవ తత్కావ్యం ధ్వనేర్యత్ర న గోచరః. ఏతచ్చచిత్రం కవీనాం విశృంఖలగిరాం రసాదితాత్పర్యమనపేక్ష్యైవ కావ్యప్రవృత్తిదర్శనాత్ అస్మాభిః పరికల్పితం ఇదానీంతనానాం తు న్యాయ్యే కావ్యనయవ్యవస్థాపనే క్రియమాణే నాస్త్యేవ ధ్వనివ్యతిరిక్తః కావ్యప్రకారః యతః పరి

---

ఈ చిత్ర మనునది యేమి? వస్తువ్యంగ్యము కాని అలంకారవ్యంగ్యము కాని లేని దానిని చిత్రవిషయముగా నంగీకరింప వచ్చునే! అంతియే కాని రసాదులకు విషయముగా నుండని కావ్యప్రకారము సంభవింపనే సంభవింపదు. ఏలనన కావ్యమన్నది వస్తుసంస్పర్శ లేక యుండదు. జగద్గతమైన వస్తుసామాన్య మంతయు నవశ్యముగా నేదేని రసమునకో భావమునకో యంగత్వము పొందనే పొందును. తుదకు విభావముగనైన నది యంగ మగును. రసాదులు చిత్తవృత్తివిశేషములే గదా! చిత్తవృత్తి విశేషము నుత్పాదింప చేయని వస్తువేదియు కొంచమేని యుండదు. అట్లది యుత్పాదింప జేయక పోయినచో కవిభావనా విషయమే కాదు. కవి విషయ మగునదే నిరూపిత మగును. కాగా వస్త్వలంకారరూప వ్యంగ్య రహితమునే చిత్రముగా పరిగణింప రాదేమి? యని యిచటి యా శంకా పరమార్థము.

ఈ సందేహ నివృత్తికై యీ రచన యిచట నావశ్యకము. ఈ చెప్పిన దంతయు సత్యమే. రసాదుల ప్రతీతి యుండని కావ్యప్రకార ముండ దనుట వాస్తవము. కాని రసభావాది వివక్షాశూన్యుడగు కవి శబ్దాలంకారమును కాని యర్థాలంకారమును గాని యుపనిబంధించు నేని యప్పు డాతని వివక్ష ననుసరించి యర్థమునకు రసాది శూన్యత నిశ్చిత మగును. రసభావాది విషయమైన వివక్ష లేక యలంకారము నిబంధించుట చిత్రవిషయ మన వలెను. రసాదుల విషయమై తాత్పర్య యుక్త మగు వివక్ష యున్నచో ధ్వనిగోచరము కాని కావ్య ముండదు. ఇట్టి యీ

పాకవతాం కవీనాం రసాదితాత్పర్యవిరహే వ్యాపార ఏవ న శోభతే. అచేతనా అపి హి భావా యథాయథం ఉచితరసవిభావతయా చేతన వృత్తాంతయోజనయా వా న సంత్యేవ తే యే యాంతి న రసాంగతాం తథా చ ఇదముచ్యతే.

అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం సర్వమేవ తత్
భావానచేతనానపి చేతనవత్ చేతనానచేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా.

రసతాత్పర్యవతః కవేః తదిచ్ఛయా వస్తు సర్వాత్మనా అభిమత రసాంగతాం ధత్తే. తథోపనిబధ్యమానం చారుత్వాతిశయం పుష్ణాతి. సర్వ

---

చిత్రము విశృంఖలవాక్కులైన కవులు రసాది తాత్పర్యము నుపేక్షించి కావ్యప్రవృత్తులై కన్పడుటచే మేము పరికల్పించితిమి. ఇప్పటివారు యోగ్యమైన కావ్యనయ వ్యవస్థాపన మొనరించిరేని ధ్వనివ్యతిరిక్త మగు కావ్య ప్రకార మనునది యుండదు. పరిపాకము కల కవులకు రసాదితాత్పర్యము లేక పోవుచో వ్యాపారమే శోభింపదు. అచేతనపదార్థము లైనను యథానుకూలముగా సముచిత రసవిభావముగ కాని, చేతనవృత్తాంత యోజనముననగాని రసాంగత్వమును పొందును. అట్లు పొందకుండునవి యుండవు. కావున నిది యిచట నవసరప్రాప్తము.

అపారమగు కావ్యసంసారమున కవి యొకడే ప్రజాపతి. అతని కీ విశ్వ మెట్లభిరుచిత మగునో యట్లే యది ప్రవర్తనము పొందును. కవి కావ్యమున శృంగారోక్తములైన విభావానుభావ వ్యభిచారుల చర్వణా రూప ప్రతీతిమయుఁ డగునేని జగమంతయు రసమయ మగును. అతడే వీతరాగుఁ డగునేని సర్వజగము నీరస మగును. సుకవి యగువాడు కావ్యమున స్వతంత్రముగా నచేతన భావములను చేతనములుగను, చేతనభావముల నచేతనములుగను యథేష్టముగా నిరూపించి వ్యవహరించును.

రస తాత్పర్య యుక్తుడైన కవి యిచ్ఛానుసారమున వస్తు వన్నివిధముల నభిమత రసాంగత్వము పొందును. అట్లే నిబంధించినచో నది చారు

మేతచ్చ మహాకవీనాం కావ్యేషు దృశ్యతే. ఏవం స్థితే సర్వ ఏవ కావ్య ప్రకారః న ధ్వనిధర్మతామతిపతతి. తదేవం ఇదానీంతనకవి కావ్య నయోపదేశే క్రియమాణే ప్రాథమికానామభ్యాసార్థినాం యది పరం చిత్రేణ వ్యవహారః ప్రాప్తపరిణతీనాం తు ధ్వనిరేవ కావ్యం ఇతి స్థితమేతత్.

తస్య చ ధ్వనేః స్వప్రభేదైః గుణీభూతవ్యంగ్యేన వాచ్యాలంకారైశ్చ సంకరసంసృష్టివ్యవస్థాయాం క్రియ మాణాయాం బహుప్రభేదతా లక్ష్యే దృశ్యతే. రసధ్వనివ్యతిరిక్తానాం ప్రభేదాంతరాణామపి కదాచిత్ సంకీర్ణత్వం భవత్యేవ.

యా వ్యాపారవతీ రసాన్ రసయితుం కాచి త్కవీనాం నవా
దృష్టిర్యా పరినిష్ఠితార్థవిషయోన్మేషా చ వైపశ్చితీ
తే ద్వే అప్యవలంబ్య విశ్వమనిశం నిర్వర్ణయంతో వయం
శ్రాంతా నైవ చ లబ్ధమబ్ధిశయన! త్వద్భక్తితుల్యం సుఖం.

ఇత్యత్ర విరోధాలంకారేణ అర్థాంతరసంక్రమిత వాచ్యస్య ధ్వని ప్రభేదస్య సంకీర్ణత్వం.

---

త్వాతిశయము పోషించును. ఈ సర్వస్వము మహాకవుల కావ్యములందు గోచరించుచునే యున్నది. విషయ మిట్లుండగా సర్వవిధ కావ్యప్రకారము ధ్వనిధర్మ మే మాత్ర మతిక్రమింపదు. ఇదానీంతన కవులకు కావ్యనయోపదేశ మొనరించు నపుడు ప్రాథమికాభ్యాసార్థులకు మొదట మొదట చిత్రమున వ్యవహార మున్నను పరిణతి విశేషమును పొందుమరేని వారి కావ్యమును ధ్వనియే యగును. ఇప్పటికీ విషయ మిట్లు సిద్ధస్వభావ మైనది.

అ ధ్వనికి స్వప్రభేదములతో గుణీభూత వ్యంగ్యముతో వాచ్యాలంకారములతో సంకర సంసృష్టి వ్యవస్థ యుండునేని బహుప్రభేదములు కలుగుట లక్ష్యములందు గోచరించు చున్నది.

రసధ్వని వ్యతిరిక్తములైన ప్రభేదాంతరములకును ఒకప్పుడు సంకీర్ణత్వము కలుగును. ఉదా:–

రస రసనా సమర్థ మైన కవుల నవదృష్టిని పరినిష్ఠితార్థ విషయముల నున్మేషింపజేయు విపశ్చిద్దృష్టిని అవలంబించి విశ్వవిశ్వ మనిశము వర్ణించుచు శ్రాంతుల మైతిమే కాని అబ్ధిశయినా! నీ భక్తి తుల్య మగు సుఖము మా కేమియు లభింప లేదు.

ఏవం ధ్వనేః ప్రభేదాః ప్రభేద భేదాశ్చ కేన సంఖ్యాతుం శక్యంతే. అస్మాభిః దిఙ్మాత్రముక్తం అనంతా హి ధ్వనేః ప్రకారాః సహృదయానాం వ్యుత్పత్తయే తేషాం దిఙ్మాత్రం కథితం. ఇత్యుక్తలక్షణో ధ్వనిః సద్భిః ప్రయత్నతో వివేచ్యః. సత్కావ్యం కర్తుం జ్ఞాతుం వా యే సమ్యగభియుక్తాః ఉక్తస్వరూప ధ్వనినిరూపణ నిపుణాః సత్కవయస్సహృదయాశ్చ నియతమేవ కావ్యవిషయే ప్రకర్ష పదవీమాసాదయంతి. యథోదితమేతత్కావ్యతత్త్వం అస్ఫుటస్ఫురితం వ్యాకర్తుమశక్నువద్భిః రీతయః సంప్రవర్తితాః. కావ్యతత్త్వం ప్రతిపాదయితుం అశక్నువద్భిః వైదర్భీగౌడీపాంచాలీచేతి రీతయః ప్రవర్తితాః రీతిలక్షణవిధాయినాం హి కావ్యతత్త్వం ఏతదస్ఫుటతయా మనాక్ స్ఫురితమాసీదితి లక్ష్యతే తదత్ర స్ఫుటతయా సంప్రదర్శితేన అన్యేన రీతిలక్షణేన నకించిత్.

అస్మిన్ కావ్యలక్షణే జ్ఞాతే శబ్దతత్త్వాశ్రయా అర్థతత్త్వయుజః వృత్తయోపి ప్రకాశంతే. వ్యంగ్యవ్యంజక భావ వివేచనమయే కావ్యలక్షణే జ్ఞాతే ఉపనాగరికాద్యాః శబ్దతత్త్వాశ్రయా వృత్తయః కైశిక్యాద్యాః అర్థతత్త్వసంబద్ధాః సమ్యగ్రీతిపదవీమవతరంతి. అన్యథా తు తాసాం వృత్తీనాం అదృష్టార్థానామివ అశ్రద్ధేయత్వమేవ స్యాత్ న అనుభవసిద్ధత్వం.

---

ఈ పద్యము నందు విరోధాలంకార మున్నది. అది యర్థాంతర సంక్రమిత వాచ్యమగు ధ్వనిప్రభేదముతో సంకీర్ణ మగు చున్నది. ఇట్లీ ధ్వని ప్రభేద ప్రభేదములు సంఖ్యానింప శక్యములు కావు. మేము సూచనముగా చెప్పితిమి. ధ్వని ప్రకారము లనంతములు. సహృదయుల వ్యుత్పత్తికై వాని సంగ్రహమే నిరూపితము. ఈ లక్షణ లక్షితమైన ధ్వనిని యోగ్యులు ప్రయత్నమున వివేచింప వలయును. సత్కావ్యమొనరించుటకు గాని తెలిసి కొనుటకు గాని చక్కగా నభినివేశము కలవారీ చెప్పిన ధ్వని నిరూపణ నిపుణులై సత్కవులై సహృదయులై నియతముగా కావ్య విషయమున ప్రకర్ష పదవి పొంద కలరు. ఇట్లు సముదితమైన కావ్య తత్త్వమస్ఫుట స్ఫురితము. దీని వ్యాకరించుట కశక్తు లగువారు రీతులను ప్రవర్తింప జేసిరి. కావ్యతత్త్వ ప్రతిపాదనాసమర్థులు వైదర్భీ గౌడీ పాంచాలీ రీతులను చెప్పిరి. రీతి లక్షణవిధాతల కావ్యతత్త్వము చూడగా నీ ధ్వని యస్ఫుటముగా కొంచెము స్ఫురితమైన ట్లూహింపవచ్చును. దాని నిచట

ఏవం స్ఫుటతయైవ లక్షణీయం స్వరూపమస్య ధ్వనేః యత్ర శబ్దానా మర్థానాం చ కేషాంచిత్ ప్రతిపత్తృవిశేష సంవేద్యం చారుత్వం అనాఖ్యేయమవభాసతే కావ్యే తత్ర ధ్వనివ్యవహార ఇతి యల్లక్షణం ధ్వనే రుచ్యతే కేనచిత్ తదయుక్తమితి నాభిధేయతా మర్హతి.

యతః శబ్దానాం స్వరూపాశ్రయః విశేషః తావత్ అక్లిష్టత్వేసత్య ప్రయుక్త ప్రయోగః వాచకాశ్రయస్తు ప్రసాదో వ్యంజకత్వం చేతి విశేషః. అర్థానాం చ స్ఫుటత్వేనావభాసనం వ్యంగ్యపరత్వం వ్యంగ్యాంశవిశిష్టత్వం చేతి విశేషః. తౌ చ విశేషౌ వాఖ్యాతుం శక్యేతే, వ్యాఖ్యాతౌ చ బహు

---

మేము స్ఫుటముగా ప్రదర్శించితిమి. ఇక వారి వారి రీతిలక్షణమున నేమి ఫలము?

ఈ కావ్యలక్షణమును దెలిసినచో శబ్దతత్త్వాశ్రయములు అర్థతత్త్వ యోగులు నయిన వృత్తులు ప్రకాశించును. ఉపనాగరికాదులు శబ్దతత్త్వా శ్రయము లయిన వృత్తులు. కైశిక్యాదు లర్థతత్త్వసంబద్ధము లయిన వృత్తు వ్యంగ్యవ్యంజకభావవివేచనమయమయిన కావ్యలక్షణము సుజ్ఞాతమయ్యె నివి లెస్సగా రీతిపదవి నవతరించును. కాకపోయినచో నా వృత్తు ర్థముల వలె నశ్రద్ధేయములె యగును. అనుభవసిద్ధముగా నుండవు. ధ్వని

ఇట్లే ధ్వనికి స్ఫుటముగ లక్షణ మొనరింప వచ్చును రుత్వము స్వరూపము తెలియ వచ్చును. కాగా, "కొన్నికొన్ని శబ్దముల శేష సంవే కాని, కొన్నికొన్ని యర్థముల చారుత్వము కాని ప్రతిపత్త నాఖ్యేయము. ద్యమె యగును. కాని చెప్పుటకు శక్యము కాదు. అ వ్యవహార మొనర్ప కావ్యమున నట్టి యనాఖ్యేయ తత్త్వ మున్నచో ధ్వని యుక్తము కాదు. వలయును. ఇదియే ధ్వని లక్షణము" అని యొక డను అట్లన రాదను.

శబ్దార్థముల చారుతా విశేష మంత చెప్పశక్యము కానిది కాదు కదా! చూడుడు! శబ్దముల స్వరూపాశ్రయమయినచారుతా విశేష మన్నది యక్లిష్టముగా నుండుట యొకటి. యప్రయుక్త ప్రయోగము కలిగి యుండుట మరి యొకటి. వాచకాశ్రయ మయిన చారుతాశేషము. ప్రసాద మొకటి వ్యంజకత్వముండుట మరి యొకటి. అర్థముల చారుతా విశేష మనునది, స్ఫుటముగా నవభాసించుట, వ్యంగ్యపరముగా నుండుట, వ్యంగ్యాంశ విశి

ప్రకారం తద్వ్యతిరితిక్తానాఖ్యేయ విశేషసంభావనా తు వివేకావసాద భావమూలైవ కావ్యవిశేషాణాం రత్నవిశేషాణాముభయేషామపి తేషాం ప్రతిపత్తృవిశేషసంవేద్యత్వమస్త్యేవ వైకటికా ఏవ హి రత్నవిదః సహృదయా ఏవ హి కావ్యానాం రసజ్ఞా ఇతి కస్యాత్ర విప్రతిపత్తిః తస్మాల్లక్షణాంతరస్య అఘటనాత్ తస్య ఉక్తమేవధ్వనిలక్షణం సాధీయః

ఇతి తృతీయః.

---

ష్టమగుట యని విశద మయినది కదా! ఇట్టి విశేషములు వ్యాఖ్యానింప శక్యములె. నానావిధముల నాయా విశేషములను విశద పఱచితిమి కదా! ఇంకను వ్యతిరిక్తముగా "అనాఖ్యేయము అనాఖ్యేయము" అనుట యిది యేటి మాట! ఇంకను అనాఖ్యేయ విశేష సంభావన యొనర్చుట వివేకావసాద భావ మూలమె యనవలయును. కావ్యవిశేషములు రత్నవిశేషములు అను నీ యుభయములు ప్రతిపత్తృ విశేష సంవేద్యము లన్నది యుండనే యున్నది. వైకటికులె రత్నవిదులు. సహృదయులె కావ్యరసజ్ఞులు. ఇం దెవరికిని విప్రతిపత్తి యుండదు. కావున నన్యలక్షణము ఈ ధ్వనికి ఘటింపదు. ఈ చెప్పినదే ధ్వనిలక్షణము. ఇదియె యుక్తము.

తృతీయోద్ద్యోతము.

# ధ్వ ని సా రః

## చతుర్థః

ఏవం ధ్వనిం విప్రతిపత్తినిరాసార్థం వ్యుత్పాద్య తద్వ్యుత్పాదనే ప్రయోజనాంతరముచ్యతే. య ఏష ధ్వనేః గుణీభూతవ్యంగ్యస్య చ మార్గః ప్రకాశితః తస్య ఫలాంతరం కవిప్రతిభానంత్యం అతో ధ్వనేరుక్తప్రభేద మధ్యాదన్యతమేనాపి ప్రకారేణ విభూషితా సతీ వాణీ పురాతనకవినిబద్ధార్థసంస్పర్శవత్యపి నవత్వమాయాతి.

అయం రసభావ తథాభాస తత్ప్రశమనలక్షణో మార్గో యథాస్వం విభావానుభావ ప్రభేదకలనయా బహువిస్తరః స సర్వ ఏవ అనయా యుక్త్యా అనుసర్తవ్యః యస్య రసాదేరాశ్రయాదయం కావ్యమార్గః పురాతనైః కవిభిః సహస్రసంఖ్యైరసంఖ్యైర్వా బహుప్రకారం క్షుణ్ణత్వాన్మితో ప్యనంతతామేతి రసభావాదీనాం హి ప్రత్యేకం విభావానుభావ వ్యభిచారి సమాశ్రయాదపరిమితత్వం తేషాం చైకైకప్రభేదాపేక్షయాపి తావత్ జగద్వృత్తముపనిబధ్యమానం సుకవిభిః తదిచ్ఛావశాదన్యథాస్థితమప్యన్యథైవ వివర్తతే.

---

ఇట్లింత వరకు విప్రతిపత్తి నిరాసార్థమై ధ్వని వ్యుత్పాదిత మయినది. దాని వ్యుత్పాదనమున ప్రయోజనాంతరమును గలదు. దాని నిచట జెప్పుదుము. ధ్వనికిని గుణీభూతవ్యంగ్యమునకును మార్గమును ప్రకాశింప జేసితిమి గదా! కవి ప్రతిభానంత్య మనునది తత్ఫలాంతరము. ధ్వనికి గల భేద ప్రభేద ములలోని యొక ప్రకారముచే నయిన, వాణి విభూషిత మగునేని ప్రాచీన కవులు నిబంధించిన యర్థ సంస్పర్శ మున్నను నవత్వము సిద్ధించును. రస, భావ, తదాభాస, తత్ప్రశమన రూపమయిన యీ మార్గము తమ తమ స్వరూపములకు తగినట్లుగా విభావానుభావ ప్రభేదముల కలయికచే నత్యంతము విస్తృత మగును. ఆ సర్వ మీ విధానమున ననుసరింప దగినది. రసాద్యాశ్రయమున నీ కావ్యమార్గ మనంత మగును. పురాతన కవులు సహస్ర సంఖ్యగా గాని యసంఖ్యాకముగా గాని నానావిధముల క్షుణ్ణ మొనరించినను అనంతరూప మగును. రసభావాదులు ప్రత్యేక ప్రత్యేక ముగా విభావానుభావ వ్యభిచారి సమాశ్రయమున నపరిమితము లగును

అతథాస్థితానపి తథాసంస్థితానివ హృదయే యా నివేశయతి
అర్థవిశేషాన్ సా జయతి వికటకవి గోచరా వాణీ.

తదిత్థం రసభావాద్యాశ్రయేణ కావ్యార్థానామానంత్యం సుప్రతిపాదితం ఏతదేవోపపాదయితు మిదముచ్యతే.

దృష్టపూర్వా అపి హ్యర్థా కావ్యే రసపరిగ్రహాత్
సర్వే నవా ఇవాభాంతి మధుమాస ఇవ ద్రుమాః.

యథా; ఏవంవాదిని దేవర్షా ఇత్యాది శ్లోకస్య.

కృతేవరకథాలాపే కుమార్యః పులకోద్గమైః
సూచయంతి స్పృహా మంతర్లజ్జయావనతాననాః.

ఇత్యాదిషు సత్సు అర్థశక్త్యుద్భవానురణనరూప వ్యంగ్యస్య నవత్వం.

---

ఏకైక ప్రభేదానుసారమున సుకవులు జగద్వ్యాప్తమును నిబంధించినను వారి యిచ్ఛావశమున నది యిదివరలో నెట్లున్నను అన్యరూపమున వివర్తము పొందును.

"సుకవి గోచర మగు వాణి యర్థవిశేషములను అతథాస్థితము లయినను తథాసంస్థిత ములనుగ జేసి హృదయమున నివేశింప జేయును. ఆ సుకవి వాణి "జయతి."

ఇట్లు రసభావాద్యాశ్రయమున కావ్యార్థము లనంతము లగుట సుప్రతిపాదిత మయినది. ఈ యంశమునే యుపపాదించుట కిది చెప్పుదుము.

"ప్రపంచ భావములు పూర్వదృష్టము లయినను రసపరిగ్రహమున కావ్యము నం దన్నియు మధుమాసము నందు వృక్షముల వలె నవ్యములై భాసించును." ఉదాహరణము.

"పెండ్లి కొడుకు కథా సంలాపము రాగా కన్యలు నును సిగ్గుచే నవనతాననలై పులకోద్గమములతో లోలోని యభిలాషమును సూచనము చేయుదురు."

ఇత్యాద్యర్థము లున్నను అర్థశక్త్యుద్భవానురణన రూప వ్యంగ్య మయిన "ఏవం వాదిని దేవర్షౌ" అను పద్యము నవార్థమై ప్రకాశించుచున్నది. ఇట్లు వ్యంగ్యభేద సమాశ్రయణమున కావ్యార్థములకు నవత్వము సిద్ధమయినట్లు వ్యంజకభేద సమాశ్రయణమున గూడ నవత్వము

యథా వ్యంగ్యభేదసమాశ్రయేణ ధ్వనేః కావ్యార్థానాం నవత్వ ముత్పద్యతే తథా వ్యంజకభేదసమాశ్రయేణాపి అత్ర చ పువః పునరుక్త మపి సారతయేదముచ్యతే అస్మిన్నర్థానంత్యహేతౌ వ్యంగ్యవ్యంజకభావే విచిత్రే శబ్దానాం సంభవత్యపి కవిరపూర్వార్థలాభార్థీ రసాదిమయ ఏకస్మిన్ వ్యంగ్యవ్యంజకభావే యత్నాదవదధీత. రసభావ తదాభాస రూపే హి వ్యంగ్యే తద్వ్యంజకేషు చ యథానిర్దిష్టేషు వర్ణపద వాక్య రచనాప్రబంధేషు అవహితమనసః కవేః సర్వమపూర్వం కావ్యం సంపద్యతే. తథా చ రామాయణ మహాభారతాదిషు సంగ్రామాదయః పునః పునరభి హితా అపి నవనవాః ప్రకాశంతే.

ప్రబంధే చాంగీ రస ఏక ఏవోపనిబధ్యమానోఽర్థవిశేషలాభం ఛాయాతిశయం పుష్ణాతి. యథా రామాయణే, యథా వా మహాభారతే. రామాయణే హి కరుణో రసః స్వయమాదికవినాసూత్రితః. "శోకః శ్లోక త్వమాగతః" ఇత్యేవంవాదినా, నిర్వ్యూఢశ్చ స ఏవ సీతాత్యంతవియోగ పర్యంతమేవ స్వప్రబంధముపరచయతా.

---

సిద్ధించును. ఈ యంశము బహుప్రతిపాదితమయినను సార మయిన దగుట నిట్లు చెప్పుదుము. శబ్దముల కీ యర్థానంత్యహేతు వగు వ్యంగ్యవ్యంజక భావము విచిత్రమై సంభవించునది యయినను అపూర్వార్థలాభము నర్థించు కవి రసాదిమయ మగు నొకవ్యంగ్యవ్యంజక భావము నందే యత్నమున నవ ధానము కలవాడు కావలయును. రస భావ తదాభాస రూప మయిన వ్యంగ్యమునందు, పూర్వము నిర్దేశించిన వర్ణ, పద, వాక్య, రచనా, ప్రబంధ రూప ములయిన తద్వ్యంజకము లందు కవి యవహిత మనస్కు డగు నేని కావ్య మంతయు నపూర్వముగా సంపన్న మగును. రామాయణ మహాభార తాదులందు సంగ్రామాదులు పునఃపునరభిహితములె యయినను నవనవములై ప్రకాశించు చున్నవి. ప్రబంధము నందు రస మొకటియె యంగిగా నిబంధింప బడునేనియర్థవిశేష లాభమును ఛాయాతిశయమును పోషించు నది యగును. ఉదాహరణము రామాయణము మహాభారతమును.

శోకము శ్లోకత్వము పొందించిన యాదికవి వాల్మీకి రామాయణ మున కరుణరసము నాసూత్రించెను. సీతాత్యంత వియోగ పర్యంతమె తన ప్రబంధము రచించి యా కరుణరసమునె నిర్వహించెను.

మహాభారతేపి శాస్త్రరూపకావ్యచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవవిర సావసాన వైమనస్యదాయినీం సమాప్తిముపనిబధ్నతా మహామునినా వైరాగ్య జననతాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః శాంతో రసశ్చ ముఖ్యతయా వివక్షావిషయత్వేన సూచితః ఏత చ్చాంశేన వివృతమేవ అన్యైః వ్యాఖ్యావిధాయిభిః స్వయమేవచైతదుద్గీర్ణం తేన ఉదీర్ణ మహామోహమగ్నముజ్జిహీర్షతా లోకం అతివిమలజ్ఞానాలోక దాయినా లోకనాథేన.

యథా యథా విపర్యేతి లోకతంత్రమసారవత్
తథా తథా విరాగోఽత్ర జాయతే నాత్ర సంశయః.

ఇత్యాది బహుశః కథయతా. తతశ్చ శాంతో రసో రసాంతరైః, మోక్షలక్షణః పురుషార్థః పురుషార్థాంతరైరుపసర్జనత్వేనానుగమ్యమానః అంగిత్వేన వివక్షావిషయః ఇతి మహాభారత తాత్పర్యం సువ్యక్తమేవావ భాసతే.

---

శాస్త్ర రూప కావ్యచ్ఛాయాన్వయము కల మహాభారతము నందును వృష్ణిపాండవుల విరసావసానమున వైమనస్యమునె కూర్చు సమాప్తిని నిబంధించు మహాముని వ్యాసభట్టారకుడు తన ప్రబంధమునకు వైరాగ్యము కలుగ జేయుటయె మహాతాత్పర్యమని ప్రధానముగ ప్రదర్శించెను. మోక్ష పురుషార్థము శాంతరసమును ముఖ్యముగా వివక్షా విషయ మయినటుల సూచించెను. ఈ విషయము నంశముగా (లేశముగా) వ్యాఖ్యావిధాతలు వివరణము చేసినారు. మహామోహ మగ్న మయిన లోకము నుద్ధరింప దలచి యతివిమల జ్ఞానాలోకము ప్రసాదించిన యా లోకనాథుడు స్వయ ముగా దీనిని వ్యక్తము చేసెను.

"నిస్సారపదార్థము వలె నీ లోక తంత్ర మెట్లెట్లు విపర్యాసము పొందునో యట్లట్లిచట విరాగ ముదయించును. ఇందు సంశయము తగదు." అని బహుపర్యాయములు చెప్పి చెప్పి పైవిషయమునె విశదము చేసెను. కావున శాంతరసము రసాంతరములతో, మోక్షపురుషార్థము పురుషార్థాం తరములతో నుపసర్జనముగా ననుగమ్యమానమై యంగిగా వివక్షావిషయమై యుండుట మహాభారత తాత్పర్యమని సువ్యక్తముగనే యవభాసించు చున్నది.

శాంతస్యైవ రసస్య అంగిత్వం మహాభారతే, మోక్షస్య చ సర్వ పురుషార్థేభ్యః ప్రాధాన్యం, ఇత్యేతత్ న స్వశబ్దాభిధేయత్వేన అనుక్రమణ్యా దర్శితం దర్శితం తు వ్యంగ్యత్వేన "భగవాన్వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః" ఇత్యస్మిన్ వాక్యే. అనేన హి అయమర్థో వ్యంగ్యత్వేన వివక్షితః, యదత్ర మహాభారతే పాండవాదిచరితం యత్కీర్త్యతే తత్సర్వం అవసానవిరసం అవిద్యాప్రపంచరూపం చ. పరమార్థ సత్యస్వరూపస్తు భగవాన్ వాసుదేవోఽత్ర కీర్త్యతే. తస్మాత్తస్మిన్నేవ పరమేశ్వరే భగవతి భవత! భావితచేతసః. మాభూత! విభూతిషు నిస్సారాసు రాగిణః, గుణేషు వా నయవినయ పరాక్రమాదిష్వమీషు కేవలేషు కేషు చిత్సర్వాత్మనా ప్రతినివిష్టధియః, తథా చాగ్రే పశ్యత! నిస్సారతాం సంసారస్య. ఇత్యముమేవార్థం ద్యోతయన్ స్ఫుటమేవావభాసతే. వ్యంజకశక్త్యనుగృహీతః "చ" శబ్దః. అయం చ నిగూఢరమణీయోఽర్థః మహాభారతావసానే హరివంశ వర్ణనేన సమాప్తిం విదధతా తేనైవ కవివేధసా కృష్ణద్వైపాయనేన సమ్యక్ స్ఫుటీకృతః

---

మహాభారతమునందు శాంతమే యంగి రసము. సర్వపురుషార్థముల కన్న మోక్షమునకె ప్రాధాన్య మున్నది. ఈ యంశము ననుక్రమణికలో స్వశబ్దాభిధేయముగా దర్శింప లేదు. వ్యంగ్యముగా ప్రదర్శించెను. "సనాతన వాసుదేవ భగవాను డిందు కీర్తితు డగును" అన్న వాక్యమున నీ భావము వ్యంగ్యముగా గోచరించును. ఈ వాక్యమున నీ యర్థము వివక్షితమై వ్యంగ్యముగా గోచరించును. మహాభారతమున గీర్త్యమాన మగు పాండవాది చరిత మంతయు నవసానవిరసము నవిద్యాప్రపంచ రూపమును. పరమార్థ సత్యస్వరూపుడు వాసుదేవ భగవాను డిందు కీర్త్యమాను డగుచున్నాడు. కావున నా పరమేశ్వరునందే భావితచేతస్కులు కండు! నిస్సారములయిన విభూతులం దనురాగులు కాకుడు! ఈ నయ వినయ పరాక్రమాది కతిపయ కేవల గుణము లం దభినివేశము కలవారు కా వలదు. ఈ సంసార నిస్సారత్వము నిటు ముందు చూడుడు!" అను నీ యర్థమును స్ఫుటముగ ద్యోతనము చేయునదై "వాసుదేవశ్చ" అను స్థలమున నున్న "చ" కారము వ్యంజక శక్త్యనుగృహీతమై యవభాసించు చున్నది. నిగూఢ రమణీయ మగు నీ యర్థమును, మహాభారతావసానమున హరివంశ

అనేన చార్థేన సంసారాతీతే తత్త్వాంతరే భక్త్యతిశయం ప్రవర్తయతా సకల ఏవ సాంసారికో వ్యవహారః పూర్వపక్షీకృతో న్యక్షేణ ప్రకాశతే దేవతాతీర్థతపః ప్రభృతీనాం చ ప్రభావాతిశయవర్ణనం తస్యైవ పరబ్రహ్మణః ప్రాప్త్యుపాయత్వేన, తద్విభూతిత్వేనైవ దేవతావిశేషాణాం అన్యేషాంచ. పాండవాదిచరితవర్ణనస్యాపి వైరాగ్యజననతాత్పర్యాత్ వైరాగ్యస్య చ మోక్షమూలత్వాత్, మోక్షస్య చ భగవత్ప్రాప్త్యుపాయత్వేన ముఖ్యతయా గీతాదిషు ప్రదర్శితత్వాత్ పరబ్రహ్మప్రాప్త్యుపాయత్వమేవ.

తదేవం అనుక్రమణీనిర్దిష్టేన వాక్యేన భగవద్వ్యతిరేకిణః సర్వస్య అన్యస్య అనిత్యతాం ప్రకాశయతా మోక్షలక్షణ ఏవైకః పరః పురుషార్థః శాస్త్రనయే, కావ్యనయే చ తృష్ణాక్షయ సుఖపరిపోష లక్షణః శాంతో రసః మహాభారతస్య అంగిత్వేన వివక్షిత ఇతి సుప్రతిపాదితః. అత్యంత సారభూతత్వాచ్చాయమర్థః వ్యంగ్యత్వేనైవ దర్శితో న తు వాచ్యత్వేన

---

వర్ణనమును చేయుచు సమాప్తి నాచరించు కవిబ్రహ్మ కృష్ణద్వైపాయనుడే సమ్యగ్విధానమున స్ఫుటీకరించినాడు.

సంసారాతీత తత్త్వాంతరము నందే భక్త్యతిశయమును ప్రవర్తింప జేయు నీ యర్థమే సకల సాంసారిక వ్యవహారమును పూర్వపక్షీకరించి సంపూర్ణమై ప్రకాశించు చున్నది. ఆ పరబ్రహ్మ ప్రాప్త్యుపాయముగనే దేవతా విశేషముల యన్యముల వర్ణనము కూడ తద్విభూతిగ నిరూపిత మయినది. పాండవాది చరితవర్ణన మునకును వైరాగ్యజననమె తాత్పర్యము. వైరాగ్యము మోక్షమూలముకదా! మోక్షమును భగవత్ప్రాప్త్యుపాయ మగుట ముఖ్యముగా గీతాది గ్రంథములందు ప్రదర్శిత మయినందు వలన భగవత్ప్రాప్త్యుపాయమె.

ఇట్టి యనుక్రమణికలో నిర్దేశించిన వాక్యమున భగవద్వ్యతిరిక్తమగు నన్య మేది యైన ననిత్యమె యని ప్రకాశింప చేసి నట్లయినది. భారతము శాస్త్రకావ్యము గావున “శాస్త్ర నయమున, మోక్ష మొక్కటియె. పర పురుషార్థము, కావ్య నయము నందును తృష్ణాక్షయ పరిపోషరూప మయిన శాంతమె రసము” అను నంశము మహాభారతమున నంగిగా వివక్షితమయిన దని చక్కగా ప్రతిపాదించి నట్లయినది. ఈ యర్థ మత్యంతము సారభూత

సారభూతో హ్యర్థః స్వశబ్దానభిధేయత్వేన ప్రకాశితః సుతరామేవ శోభా మావహతి. ప్రసిద్ధిశ్చేయమస్త్యేవ విదగ్ధవిద్వత్పరిషత్సు, యదభిమతతరం వస్తు వ్యఙ్గ్యత్వేన ప్రకాశ్యతే న సాక్షాచ్ఛబ్దవాచ్యత్వేన. తస్మాత్ స్థిత మేతత్ – అఙ్గిభూతరసాద్యాశ్రయేణ కావ్యే క్రియమాణే నవార్థలాభో భవతి, బంధచ్ఛాయా చ మహతీ సంపద్యత ఇతి. తదేవం ధ్వనిప్రభేద సమాశ్రయేణ యథా కావ్యార్థానాం నవత్వం జాయతే తథా ప్రతిపాది తం, గుణీభూతవ్యఙ్గ్యస్యాపి యే ప్రకారా స్తత్సమాశ్రయేణాపి కావ్య వస్తూనాం నవత్వం భవత్యేవ.

ఇత్థం ధ్వనేః గుణీభూతవ్యఙ్గ్యస్య చ సమాశ్రయాత్ సత్స్వపి పురాతనకవిప్రబంధేషు ప్రతిభాగుణో యది స్యాత్ కావ్యార్థవిరామో నాస్తి. తస్మిం స్త్వసతి న కించిదేవ కవేర్వస్త్వస్తి.

వ్యంగ్యార్థాపేక్షయైవ అర్థానంత్యం న యావద్వాచ్యార్థాపేక్షయా పీతి ప్రతిపాదయితు ముచ్యతే.

అవస్థాదేశకాలాది విశేషైరపి జాయతే
ఆనంత్యమేవ వాచ్యస్య శుద్ధస్యాపి స్వభావతః.

---

మయినందున వ్యంగ్యముగనే ప్రదర్శిత మయినది వాచ్యముగ నిరూపితము కా లేదు. సారభూత మయిన యర్థము స్వశబ్దానభిధేయముగ ప్రకాశిత మగునేని మిక్కిలి శోభ నావహించును. అభిమతతర మయిన వస్తువు విదగ్ధ పరిషత్తులందు వ్యంగ్యముగనే ప్రకాశిత మగును గాని సాక్షాచ్ఛబ్ద వాచ్య ముగ నుండ దను ప్రసిద్ధి యుండనే యున్నది గదా! కావున సారముగా నీ యర్థము సిద్ధ మగును. "అంగిభూత రసాద్యాశ్రయమున కావ్య మొనరిం చినచో నవార్థ లాభము కలుగును. బంధచ్ఛాయయు గొప్పగా సంపన్న మగును." అని. ఇట్లీ విధముగా ధ్వని ప్రభేద సమాశ్రయమున కావ్యార్థ ములకు నవత్వ సంపత్తి కలుగుట ప్రతిపాదిత మయినది. ఇట్లే గుణీభూత వ్యంగ్యప్రకార సమాశ్రయణమున గూడ కావ్యవస్తువులకు నవత్వము సిద్ధించు నని తెలియు నది.

ఇట్లీ ధ్వని గుణీభూతవ్యంగ్యము నాశ్రయించి నందున పురాతన కవి ప్రబంధము లెన్ని యున్నను ప్రతిభాగుణమే యుండునేని కావ్యార్థ విరామ ముండదు. ప్రతిభాగుణము లేదేని కవికి వస్తు వన్న దేదియు నుండదు.

శుద్ధస్య అనపేక్షితవ్యంగ్యస్యాపి వాచ్యస్య ఆనన్త్యమేవ జాయతే స్వభావతః స్వభావోహ్యయం వాచ్యానాం చేతనానామచేతనానాం చ యదవస్థాభేదా ద్దేశభేదా త్కాలభేదాత్ స్వాలక్షణ్యభేదాచ్చ అనంతతా భవతి తైశ్చ తథా వ్యవస్థితైః సద్భిః స్వభావో క్త్యాపి తావదుపనిబధ్యమానైః నిరవధిః కావ్యార్థః సంపద్యతే.

తథా హి అవస్థాభేదాన్నవత్వం యథా. భగవతీ పార్వతీ కుమార సంభవే "సర్వోపమాద్రవ్యసముచ్చయేన" ఇత్యాదిభిరుక్తిభిః ప్రథమమేవ పరిసమాపితరూపవర్ణనాపి పునర్భగవతః శంభోర్లోచనగోచరమాయాంతీ "వసంతపుష్పాభరణం వహంతీ మన్మథోపకరణభూతేన భంగ్యంతరేణోప వర్ణితా. సైవ చ పునర్నవోద్వాహసమయే ప్రసాధ్యమానా "తాం ప్రాఙ్ముఖీం తత్ర నివేశ్య తన్వీం" ఇత్యాద్యుక్తిభిర్నవేనైవ ప్రకారేణ నిరూపిత రూపసౌష్ఠవా. న చ తే తస్య కవేరేకత్రైవాసకృత్కృతా వర్ణనప్రకారా అపునరుక్తత్వేన నా నవనవార్థనిర్భరత్వేన న ప్రతిభాసంతే!

---

కావ్యము లందర్థానంత్య ముండుట వ్యంగ్యార్థాపేక్షమునసే కాదు. వాచ్యార్థాపేక్షమున గూడ నర్థానంత్య మున్నదని ప్రతిపాదించుట కీ యంశము చెప్పుదుము.

శుద్ధ మయిన వాచ్యమునకును అవస్థా, దేశ, కాలాది విశేషములచే స్వభావసిద్ధముగా నానంత్యము కలుగును. వ్యంగ్య సంబంధము లేమి శుద్ధముగా నుండు వాచ్యమునకును స్వభావ రమణీయతను బట్టి యానం త్యము కలుగును. చేతనములు నచేతనము లయిన వాచ్యముల కవస్థా భేద మున దేశభేదమున కాలభేదమున స్వాలక్షణ్యా భేదముననను అనంతత కలు గుట యనునది స్వభావము. అవి యీ విధముగా వ్యవస్థితములైయుండియు స్వభావోక్తిచే నయిన నుపనిబధ్యమానము లగునేని కావ్యార్థము నిరవధి కమై సంపన్న మగును.

ఇట్లగుట యెంతయు యుక్తము. అవస్థా భేదమున నవత్వము కలుగుట కుదాహరణము. కుమారసంభవమున భగవతి పార్వతీ దేవి మొద టనే "సర్వోపమాద్రవ్య సముచ్చయేన" మొదలగు వాక్యములచే పరిసమా పిత రూపవర్ణన యయినది. అయినను తరువాతి గ్రంథమున శంభుభగ వానుని లోచన గోచరము పొందినపై "వసంత పుష్పాభరణం వహంతీ"

అయమపరశ్చావస్థాభేదప్రకారః యదచేతనానాం సర్వేషాం చేతనం ద్వితీయం రూపమభిమానిత్వప్రసిద్ధం హిమవద్గంగాదీనాం తచ్చ ఉచితచేతనవిషయస్వరూపయోజనయా ఉపనిబధ్యమానమన్యదేవ సంపద్యతే. యథా కుమారసంభవ ఏవ పర్వతస్వరూపస్య హిమవతో వర్ణనం, పునః సప్తర్షిప్రియోక్తిషు చేతనస్వరూపాపేక్షయా ప్రదర్శితం తదపూర్వమేవ ప్రతిభాతి. ప్రసిద్ధశ్చాయం సత్కవీనాం మార్గః. చేతనానాం చ బాల్యాద్యవస్థాభిరన్యత్వం సత్కవీనాం ప్రసిద్ధమేవ. చేతనానామవస్థాభేదేప్యవాంతరావస్థాభేదాన్నానాత్వం. యథా కుమారీణాం, కుసుమశరభిన్నహృదయానాం అన్యాసాం చ. తత్రాపి వినీతానాం అవినీతానాంచ. అచేతనానాంచ చ భావానాం ఆరంభాద్యవస్థాభేదభిన్నానామేకైకశః స్వరూపముపనిబధ్యమాన మానంత్యమేవోపయాతి.

---

మొదలగు వాక్యములచే మన్మథోపకరణ మయిన భంగ్యంతరమున మపవర్ణిత యయినది. ఆ పార్వతియే మరల సహోద్వాహ సమయమున నలంకరింపబడునదై "తాం ప్రాఙ్ముఖీం తత్ర నివేశ్య తన్వీం" మొదలగు వాక్యములచే నిరూపిత రూపసౌష్ఠవ యయినది. ఒక్క దేవి విషయముననే కవి కాళిదాసు నానావర్ణన ప్రకారముల ననేకపర్యాయములు నిరూపించెను. అవి యన్నియు నవనవార్థనిర్భరములై యపునరుక్తములై ప్రతిభాసింపవేమి?

ఇది వేరొక యవస్థాభేద ప్రకారము. అచేతనములగు హిమవద్గంగాది సర్వ పదార్థములకును నభిమానిత్వ ప్రసిద్ధమయిన చేతనాత్మకమగు ద్వితీయరూపము కలదు. అది సముచితమగు చేతనవిషయ స్వరూపయోజనమున నుపనిబధ్యమాన మగునేని క్రొత్తగనే సంపన్న మగును. కుమారసంభవము నందే యీ యుదాహరణమును గలదు. మొదట పర్వత స్వరూపమయిన హిమవద్వర్ణన మున్నది. మరల సప్తర్షి ప్రియవచన ములలో చేతన స్వరూపోద్దేశమున హిమవద్వర్ణనము ప్రదర్శిత మయినది. అది యపూర్వముగనే ప్రతిభాసించు చున్నది. సత్కవుల కీ మార్గము ప్రసిద్ధము. చేతనతత్త్వములకును బాల్యాద్యవస్థలచే నన్యత్వ మగునది సత్కవీశ్వరులకు ప్రసిద్ధమె. చేతనముల కవస్థా భేద మున్నను నవాంతరావస్థా భేదమున నానాత్వ మున్నది. కుమారికలు, కుసుమశర భిన్నహృదయలు, నింక నితర లన్నయవాంతరావస్థా భేదమున యువతులకు నానాత్వ మున్నది. అందును

దేశభేదాన్నానాత్వమచేతనానాం తావత్. యథా, వాయూనాం నానాదిగ్దేశచారిణాం అన్యేషామపి సలిలకుసుమాదీనాం ప్రసిద్ధమేవ. చేతనానామపి మానుష పశు పక్షిప్రభృతీనాం గ్రామారణ్యసలిల సమేధితానాం పరస్పరం మహాన్విశేషః సముపలక్ష్యత ఏవ. స చ వివిచ్య యథా యథముపనిబధ్యమానస్తథైవానంత్యమాయాతి. తథా హి మానుషాణామేవ తావద్దిగ్దేశాదిభిన్నానాం యే వ్యవహారవ్యాపారాదిషు విచిత్రా విశేషాస్తేషాం కేనాన్తః శక్యతే గంతుం విశేషతో యోషితాం. ఉపనిబధ్యతే చ తత్సర్వమేవ సుకవిభిర్యథాప్రతిభం.

కాలభేదాచ్చ నానాత్వం యథా; ఋతుభేదాత్ దిగ్వ్యోమసలిలాదీనాం అచేతనానాం చేతనానాం చౌత్సుక్యాదయః కాలవిశేషాశ్రయిణః ప్రసిద్ధా ఏవ. స్వాలక్షణ్యభేదాచ్చ సకలజగద్గతానాం వస్తూనాం వినిబంధనమవిగీతమేవ, తచ్చ యథావస్థితమపి తావదుపనిబధ్యమానమనంతతామేవ కావ్యార్థస్యావాదయతి.

---

వినీతలు, అవినీత లన్న భేదమున నవ్యత్వ మున్నది. ఆరంభాద్యవస్థా భేదమున వేరు వేరుగా అచేతన పదార్థముల స్వరూపము నుపనిబంధనము చేసినచో నానంత్యము సిద్ధ మగును.

అచేతనములకు దేశభేదమున నానాత్వము కలుగు ననుట కుదాహరణము. నానాదిగ్దేశ సంచారులగు వాయువులకు నితరము లయిన సలిల కుసుమాదులకును నానాత్వ ముండుట ప్రసిద్ధమే. అట్లే గ్రామములలో, నరణ్యములలో, సలిలములలో సమేధితము లయిన మానుష పశు పక్షి ప్రభృతి చేతనములలో పరస్పరము చాల విశేష మసులక్షిత మగుచునే యున్నది. ఆ విశేషమును వివేచించి వాని వానికి తగినట్లుగా నుపనిబంధన మొనర్చినచో నవి యానంత్యము పొందును. మానవులు నానావిధ దిగ్దేశాదులచే భిన్న భిన్నముగా నుందురు. వారి వారి వ్యవహార వ్యాపార వ్యాపారాదు లందును విచిత్రవిశేషము లెన్నియో కూడ యుండును. వాని కింతటి యంతు కలదని యనుట కే వానికి శక్తి యుండును? ఇంకను విశేషించి యోషిద్విషయమున నేమి యనగలము? అయినను సుకవులు తమ తమ ప్రతిభా బలానుసారమున నా సర్వము నుపనిబంధనము చేయుచునే యున్నారు.

వాల్మీకివ్యతిరిక్తస్య యద్యేకస్యాపి కస్య చిత్
ఇష్యతే ప్రతిభానంత్యం తత్తదానంత్యమక్షయం.

కించ, ఉక్తివైచిత్ర్యం యత్కావ్యనవత్వేనిబంధన ముచ్యతే తద స్మత్పక్షానుగుణమేవ. యత యావానయం కావ్యానంత్యభేదహేతుః ప్రకారః ప్రాగ్దర్శితః స సర్వ ఏవ పునరుక్తి వైచిత్ర్యాత్ ద్విగుణతామాపద్యతే.

యశ్చాయముపమాశ్లేషాదిరలంకారమార్గః ప్రసిద్ధః స భణితివైచిత్ర్యాదుపనిబధ్యమానః స్వయమేవానవధిర్ధత్తే శతశాఖతాం. భణితిశ్చ స్వభాషాభేదేన వ్యవస్థితా సతీ ప్రతినియతభాషాగోచరార్థవైచిత్ర్యనిబంధనం పునరపరం కావ్యార్థనామానంత్యమాపాదయతి. యథా యథా నిరూప్యతే తథా తథా న లభ్యతేన్తః కావ్యార్థానాం. ఇదం తూచ్యతే. అవస్థాదివిభిన్నానాం వాచ్యానాం ప్రాక్ప్రదర్శితం యద్వినిబంధనం, తత్ లక్ష్యేభూమ్నైవ దృశ్యతే. అపోహితుం న శక్యం. తత్తు రసాశ్రయాద్భాతి.

---

కాలభేదమున నానాత్వ ముండుట; అచేతనములగు దిగాకాశ సలిలాదులు ఋతుభేదమున నానాత్వము కలిగి యుండుట, చేతనవ్యక్తుల యౌత్సుక్యాదులును కాల విశేషము నాశ్రయించినవై నానాత్వము కలవగుటయు ప్రసిద్ధమె. స్వాలక్షణ్య (స్వరూప) భేదమున గూడ ననంతత్వము కల్గును. ప్రపంచవస్తువు లన్నియు స్వరూప భేదమున ననంతములై యున్నట్లు నిబంధించుటయు శిష్టకవుల యాచారముగ నున్నది. అది యంతయు నున్నది యున్నట్లుగా నుపనిబంధనము పొందు నేని కావ్యార్థమున కనంతత్వము నాపాదించును.

వాల్మీకి వ్యతిరిక్తు డగు నొకని కేని ప్రతిభానంత్య మభీష్ట మయ్యె నేని యీ యీ ప్రతిభానంత్య మంతయు నక్షయముగ నుండును. ఉక్తి వైచిత్ర్యము కావ్యనవత్వమున నిబంధన మని యందురు. అదియు మా పక్షమువనే యనుగుణము. ఇంతవరకు నిరూపించిన కావ్యానంత్య భేద హేతు ప్రకారము లన్నియు మరల నుక్తి వైచిత్ర్యమున ద్విగుణము లయి తీరును.

ఉపమ శ్లేష మొదలగు ప్రసిద్ధ మయిన యలంకారమార్గము భణితి వైచిత్ర్యమును నుపనిబంధము పొంది యది తన యంతట దా ననవధియై శతశాఖ మగును. భణితి యనునదియు కథాభేదమున వ్యవస్థిత మగును. ఆ యా భాషానియతము లయి గోచరించు నర్థవైచిత్ర్యము లందు నిబంధన

తదిదమత్ర సంక్షేపేణాభిధీయతే సత్కవీనాముపదేశాయ దేశకాలాదిభేదినీ రసభావాది సంబద్ధా ఔచిత్యానుసారిణీ వస్తుగతి రన్వీయతే యది, వాచస్పతిసహస్రాణాం సహస్రైరపి యత్నతః నిబద్ధాపి ప్రకృతిర్జగతామివ క్షయం నైతి. యథా హి జగత్ప్రకృతిః అతీతకల్పపరంపరా విర్భూతవిచిత్రవస్తుప్రపంచా సతీ పునరిదానీం పరిక్షీణపదార్థనిర్మాణశక్తిరితి న శక్యతేఽభిధాతుం. తద్వదేవేయం కావ్యస్థితిరనంతాభిః కవిమతిభిరుపభుక్తాపి నేదానీం పరిహీయతే. ప్రత్యుత నవనవాభిర్వ్యుత్పత్తిభిః పరివర్ధతే. ఇత్థం స్థితేపి సంవాదిన్యో మేధావినాం బుద్ధయః స్థితం హ్యేతత్. సుమేధసాం బాహుల్యేన సంవాదాస్తు భవంత్యేవ విపశ్చితా తే సర్వే నైకరూపతయా మంతవ్యాః కథమితిచేత్.

---

మగును. ఆ భణితి యట్లయి కావ్యార్థముల కానంత్య మాపాదించుటలో నొక నిబంధన మగుచున్నది. ఈ విషయము నెట్లెట్లు నిరూపించిన నా యా విధమున కావ్యార్థముల యంత మేమియు నందదు. ఇది మాత్రము స్పష్టము. ఇంతవరకు జెప్పిన యవస్థాది విభిన్నము లయిన వాచ్యముల వినిబంధనము లక్ష్యము లందధికముగ గోచరించుచునే యున్నది. దాని నెవరును విడనాడ శక్యము కాదు, అది రసాశ్రయమునను భాసించును.

సత్కవుల యుపదేశమునకై సంక్షేపమున నిది చెప్పబడుము, దేశకాలాది భేదమున నానారూపముగా నుండునది, ఔచిత్యానుసారి రసవస్తుగతి ననుసరించినచో, వాచస్పతి సహస్రముల సహస్రములు యత్నపూర్వకముగా నిబంధించినను ప్రపంచ ప్రకృతి వలె నే మాత్రమును క్షయమును పొందదు. ప్రపంచ ప్రకృతి యతీతము లయిన కల్పపరంపరలలో విచిత్రవస్తు ప్రపంచము నావిర్భవింప జేసినది. అయిన నీ నాడు ప్రకృతి యందలి పదార్థ నిర్మాణశక్తి పరిక్షీణ మయిన దని యెవరు ననలేరు. అట్లే యీ కావ్యస్థితియు. దీని ననంతము లయిన కవిమతు లనుభవించినవి అయిన నీ నాడు పరిహీణము కాదు. అంతియే కాక నవ నవ వ్యుత్పత్తులతో పరివర్ధనము పొందుచునే యున్నది.

విషయ మిట్లున్నను సంవాదములు బహుళముగా నున్నవి. మేధావుల బుద్ధులు సంవదించు నవి యగును కదా! ఇట్లిది సిద్ధాంతము. సుమేధసులకు బహుళముగా సంవాదములు కలుగుచునే యుండును. అయినను వాని

సంవాదో హ్యన్యసాదృశ్యం తత్పునః ప్రతిబింబవత్
ఆలేఖ్యాకారవత్ తుల్యదేహివచ్చ శరీరిణాం.

సంవాదో హి కావ్యార్థస్యోచ్యతే యదన్యేన కావ్యవస్తునా సాదృశ్యం తత్పునః శరీరిణాం ప్రతిబింబవత్, ఆలేఖ్యాకారవత్, తుల్యదేహివచ్చ త్రిధావ్యవస్థితం కించిద్ధి కావ్యవస్తు వస్త్వంతరస్య శరీరిణః ప్రతిబింబః ప్రతిబింబకల్పం అన్యదాలేఖ్యప్రఖ్యం అన్యత్తుల్యేన శరీరిణా సదృశం.

తత్ర పూర్వమనన్యాత్మ తుచ్ఛాత్మ తదనంతరం
తృతీయం తు ప్రసిద్ధాత్మ నాన్యసామ్యం త్యజేత్కవిః.

తత్ర పూర్వం ప్రతిబింబకల్పం కావ్యవస్తు పరిహర్తవ్యం సుమతినా యతస్తదనన్యాత్మ తాత్త్వికశరీరశూన్యం. తదనంతరమాలేఖ్య ప్రఖ్యం అన్యసామ్యం శరీరాంతరయుక్తమపి తుచ్ఛాత్మత్వేన త్యక్తవ్యం కవినా. తృతీయం తు కమనీయం శరీరసద్భావేసతి స సంవాదమపి కావ్యవస్తు నత్యక్తవ్యం కవినా న హి శరీరీ శరీరిణాన్యేన సదృశోప్యేక ఏవేతి శక్యతే వక్తుం.

---

నన్నిటిని విద్వాంసు డేక రూపముగ భావించ నక్కర లేదు. చూడుడు!

సంవాద మనునది యన్య సాదృశ్యము. అది దేహధారుల ప్రతిబింబము వలె, ఆలేఖ్యాకారము వలె, తుల్యదేహి వలె నుండును. ఇతర కావ్య వస్తువుతో ప్రకృత కావ్యార్థమునకు సాదృశ్య ముండుట కదా! అది శరీరుల ప్రతిబింబము వలె నాలేఖ్యాకారము వలె, తుల్యదేహి వలె మూడు విధముల వ్యవస్థిత మగును. ఒకొ్కక కావ్యవస్తువు, శరీరమునకు ప్రతిబింబము వలె వస్త్వంతరమునకు ప్రతిబింబ కల్పముగా నుండును. మఱి యొకటి యాలేఖ్యప్రఖ్యము. వే రొకటి తుల్యశరీరముతో సదృశము.

అందు మొదటిది యనన్యాత్మ. తరువాతది తుచ్ఛాత్మ. మూడవది ప్రసిద్ధాత్మ. కవి యన్యసామ్యమును విడువ నక్కర లేదు. మొదటి ప్రతిబింబ కల్ప మయిన కావ్యవస్తువును సుమతి యగువాడు పరిహరింప వలసినదే. అది యనన్యాత్మ. అందు తాత్త్విక మయిన శరీరము లేదు. రెండవది యాలేఖ్య ప్రఖ్య మగునది. అన్య సామ్యము శరీరాంతర యుక్త మయినను తుచ్ఛాత్మ యగుటచే కవి విడువ వలసినదే. మూడవది ప్రసిద్ధాత్మ కమనీయము. శరీర మన్నది యుండగా సంవాద మున్నను కవి యా కావ్యవస్తువును విడువ రాదు. ఒక శరీరి వేరొక శరీరితో సదృశు డయినను ఒకడే

ఏతదేవోపపాదయితుమిదముచ్యతే తత్వస్య సారభూతస్య అన్యస్య ఆత్మనః సద్భావే పూర్వస్థిత్యనుయాయ్యపి వస్తు భాతితరాం. పురాణరమణీయచ్ఛాయానుగృహీతం హి వస్తు శరీరవత్పరాం శోభాం పుష్యతి న తు పునరుక్తత్వే నావభాసతే. తన్వ్యాః శశిచ్ఛాయమివాననం. ఏవం తావత్సంవాదానాం సముదాయరూపాణాం వాక్యార్థానాం విభక్తాః సీమానః పదార్థరూపాణాం చ వస్త్వంతరసదృశానాం కావ్యవస్తూనాం నాస్త్యేవ దోష ఇతి ప్రతిపాదయితుముచ్యతే.

అక్షరాదిరచనేవ యోజ్యతే యత్ర వస్తురచనా పురాతనీ
నూతనే స్ఫురతి కావ్యవస్తుని వ్యక్తమేవ ఖలు సా న దుష్యతి.

న హి వాచస్పతినా ప్యక్షరాణి పదాని వా కానిచిదపూర్వాణి ఘటయితుం శక్యంతే. తాని తాన్యేవోపనిబద్ధాని న కావ్యాదిషు నవతాం విరుధ్యంతి. తథైవ పదార్థరూపాణి శ్లేషాదిమయాన్యర్థతత్త్వాని. తస్మాత్;

---

యాని చెప్ప శక్యము కాదు. ఈ యంశమునె యుపపాదించుట కిది చెప్ప వలయును. సారభూత మగు వేరొక తత్వ మాత్మగా నున్నప్పుడు వస్తువు పూర్వస్థిత్యనుయాయి యయిన నత్యంతము భాసించునది యగును, పురాణ రమణీయచ్ఛాయానుగృహీత మగు వస్తువు శరీరమువలె సమధిక శోభను పోషించును. అది పునరుక్తముగా నుండదు. శశికాంతి సుందర మయిన తరుణి యానన మిందు దృష్టాంతము. ఇట్లే విధముగా వాక్యార్థరూపములు సముదాయ రూపములు నయిన సంవాదముల సీమలు విభక్తములై యున్నవి. ఒక్కొక స్థలమున నొకటి రెండు మూడు నాలుగు పదార్థములు వస్త్వంతరములతో సమానము లయినను కావ్యవస్తువులకు దోషము కలుగదు. ఈ విషయమునే ప్రతిపాదించుట కిది చెప్ప వలయును.

అక్షరాదిరచనయే నవముగా నాయోజిత మగును. కాని యచట వస్తురచన పురాతనమె. కావ్యవస్తువు నూతనముగా స్ఫురించు నేని యందు దోష మేమియు లేక పోవుట వ్యక్తవిషయము. వాచస్పతి యయినను అక్షరములను గాని పదములను గాని కొన్నిటి నపూర్వముగా ఘటనము చేయుటకు శక్తుడు కాడు. కావ్యాదులలో నవి యవియె సముపనిబద్ధము లయినను నవత్వమున కేమియు వైరుధ్యము లేదు. అట్లే పదార్థరూపములు శ్లేషాదిమయములు నయిన యర్థతత్వములును నవత్వభంగము కలవి కావు. కావున నే;

యదపి యదపి రమ్యం యత్ర లోకస్య కించిత్
స్ఫురితమిదమితీయం బుద్ధిరభ్యుజ్జిహీతే
అనుగతమపి పూర్వచ్ఛాయయా వస్తు తాదృక్
సుకవిరుపనిబధ్నన్ నింద్యతాం నోపయాతి.

స్ఫురణేయం కాచిదితి సహృదయానాం చమత్కృతిరుత్పద్యతే. తదనుగతమపి పూర్వచ్ఛాయయా వస్తు తాదృక్ సుకవిః వివక్షితవ్యంగ్య వాచ్యార్థసమర్పణసమర్థశబ్దరచనారూపయా బంధచ్ఛాయయా ఉపనిబధ్నన్ నింద్యతాం నైవ యాతి. తదిత్థం స్థితం.

ప్రతాయన్తాం వాచో నిమితవివిధార్థామృతరసాః
న సాదః కర్తవ్యః కవిభిః అనవద్యే స్వవిషయే
పరస్వాదానేచ్ఛావిరతమనసో వస్తు సుకవేః
సరస్వత్యైవైషా ఘటయతి యథేష్టం భగవతీ.

---

ఏ యంశము నందు లోకమున కే దే విషయ మొకింత రమ్యముగ నున్నదని స్ఫురించినదై బుద్ధిసముదయము పొందునో అచట నట్టి వస్తువు పూర్వచ్ఛాయానుగత మయినను కవి నిబంధింప తగును. అపు డా కవి ఏ మాత్రమును నింద్యత్వము పొందడు. రమ్యతా విషయమగు స్ఫురణ మన్నది సహృదయులకు చమత్కృతి సంధాయకము. అపు డా వస్తువు పూర్వచ్ఛాయతో కూడుకొనినను ప్రశంసనీయ మగును. వివక్షితమగు వ్యంగ్యమునకు తగిన వాచ్యార్థమును సమర్పింప గల శబ్దరచనా రూప మయిన బంధచ్ఛాయ కలిగి యది ఉపనిబద్ధ మగు నేని నింద్యము కాదు. కావున నిది సిద్ధము.

స్వ స్వ నియతము లయిన వివిధార్థామృత రసములగు వాక్కులను కవులు విస్తరింప చేయుదురు గావుత. అనవద్యమగు స్వ విషయమున కవు లేమాత్రమును నవసాద మొనరింప రాదు. ఇతరార్థమందు కోనవలె నన్న మనసు లేని సుకవికి భగవతి సరస్వతీ దేవియే సర్వమును సంఘటింప చేయును. నవ్యములగు కావ్యార్థములు కలవు. పరులు నిబంధించిన యర్థ మునే రచనము చేయుటలో కవి కేమియు గుణముండదు. ఇట్లే భావింప వలయును. సుకవులకు ప్రాక్తన పుణ్యాభ్యాస పరిపాక వశమున ప్రవృత్తి కలుగును. వారు పరోపరచితార్థ పరిగ్రహము నందు నిస్పృహులు. అట్టి

సంతి నవాః కావ్యార్థాః పరోపనిబద్ధార్థవిరచనే న కశ్చిత్ కవే ర్గుణః ఇతి భావయేత్. ఏషాం సుకవీనాం ప్రాక్తనపుణ్యాభ్యాసపరిపాక వశేన ప్రవృత్తిః తేషాం పరోపరచితార్థపరిగ్రహ నిస్పృహాణాం స్వవ్యాపారో న కశ్చిదుపయుజ్యతే. సైవ భగవతీ సరస్వతీ స్వయం అభిమత మర్థం ఆవిర్భావయతి. ఏతదేవ హి మహాకవిత్వం మహాకవీనాం ఇతి ఓమ్.

ఇత్యక్లిష్టరసాశ్రయోచితగుణాలంకారశోభాభృతః
యస్మాద్వస్తుసమీహితం సుకృతిభిః సర్వం సమాసాద్యతే
కావ్యాఖ్యేఽఖిలసౌఖ్యధామ్ని విబుధోద్యానే ధ్వనిర్దర్శితః
సోఽయం కల్పతరూపమానమహిమా భోగ్యోఽస్తు భవ్యాత్మనాం
సత్కావ్యతత్త్వనయవర్త్మ చిరప్రసుప్త
కల్పం మనస్సు పరిపక్వధియాం య ఆసీత్
తద్వ్యాకరోత్ సహృదయోదయలాభహేతోః
ఆనంద వర్ధన ఇతి ప్రథితాభిధానః. * * * *

* భరతాది సమారంభసుబ్రహ్మణ్యగురోర్మమ
స్యానందాభినవస్యాస్తి సంప్రదాయవిశుద్ధతా
యస్య సర్వే సమారంభాః సాహితీలాస్యహేతవః
సోయం జయతి మే స్వాత్మా దేవీవాగర్థభావనః.

---

వారల కేమియు స్వవ్యాపారము ఉండ నక్కర లేదు. ఆ మహాభగవతి సరస్వతియే స్వయముగ నభిమతార్థము నావిర్భవింప చేయును. ఇదియే మహాకవుల మహా కవిత్వము.

ఇట్లక్లిష్టముగ నుండు రసము నాశ్రయించిన సముచిత గుణాలంకార శోభ కలిగిన కావ్యము నుండి సుకృతులు సర్వసమీహిత వస్తువును సంప న్నము చేసికొన వచ్చును. సర్వసౌఖ్యధామ మయిన కావ్య మన్న విబు ధోద్యానమున ధ్వని రూపిత మయినది, ఇది కల్పతరూపమాన మహిమకము. భవ్యాత్మకు లయిన భావకుల కందర కిది భోగ్య మగు గావుత.

పరిపక్వ బుద్ధులయిన సహృదయుల యంతరంగములయం దీ సత్కావ్యతత్త్వ నయ మార్గము చిరకాలము నుండి ప్రసుప్త కల్పమై నేటి వర కుండెను. సహృదయోదయ లాభమునకై ఆనందవర్ధను డన్న పేరు పఖ్యాతి కల సహృదయు డీ ధ్వని నిట్లు వ్యాకరించెను. *

# పరిశిష్టము

ధ్వనిసారములో సూచనా సారముగా అస్పష్టముగా నున్న కొన్ని విషయముల సంక్షిప్త వివరణము.

## ౧. కావ్యప్రమేయము

కవనము వర్ణనము. కవనము చేయువాడు కవి. కవి కృతి కావ్యము. కావ్యమున కూర్పు పొందు విషయజాతమునకు "కావ్యప్రమేయము" అని పేరు. వాచక, లక్షక, వ్యంజకములు అను త్రివిధశబ్దములు, వాచ్య, లక్ష్య, వ్యంగ్యము లను త్రివిధార్థములు, అభిధా, లక్షణా, వ్యంజన లను త్రివిధ వ్యాపారములు, ఓజః ప్రసాద మాధుర్యములు శ్లేషాదులు నగు గుణములు, అనుప్రాసయమకాదులగు శబ్దాలంకారములు, ఉపమాదులగు అర్థాలంకారములు, వైదర్భి, గౌడి, పాంచాలి, అను రీతులు, కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి, యను వృత్తులు, శృంగారాదినవరసములు, నిర్వేదాదులగు ముప్పది మూడు భావములు, నాయికానాయకులు, అధికారిక ప్రాసంగిక రూప మయిన కథావస్తువు, శయ్యాపాకములు, దోషములు లేకుండుట అనునివి సామాన్యముగా కావ్యప్రమేయము.

## ౨ సాహిత్య ప్రస్థానములు

భరతముని మొదలు జగన్నాథపండితరాయల వరకు వేయికి పైగా సాహిత్యశాస్త్రగ్రంథములు వెలువడినవి. వీనినన్నిటిని ఎనిమిది సంప్రదాయముల కనుకూలముగా విమర్శకులు పరిగణించిరి.

1. భరతుడు నాట్యశాస్త్ర గ్రంథమున రసమె సర్వముఖ్య మని నిర్ణయించెను. రసాతిరిక్తముగా నేమియు నుండదు. గుణాలంకారాదులన్నియు రసమునే లక్ష్యము చేసికొని స్వరూప శోభ కలవగును.

2. భామహుడు కావ్యమందలి యలంకారములకే ప్రాముఖ్యము నంగీకరించెను. అలంకారము చమత్కారప్రాణము. అది లేకున్న కావ్య ప్రవృత్తియే యుండదు. రసమయినను భావ మయిన నలంకారమె యగును.

3. దండి గుణములకు ప్రాధాన్య మంగీకరించెను. గుణమయ మగు రచన కావ్యమునకు శోభ నాపాదించును. ఓజః ప్రసాదాదిగుణములున్ననే బంధచ్ఛాయ శోభించును.

4. వామనుడు వైదర్భి, గౌడి, పాంచాలి యన్న రీతులకే కావ్యాత్మతను నిరూపించెను. రీతి యన్నది యున్ననే కావ్యమునకు స్వరూపము కలదు. రీతీతరము లన్నియు వైదర్భాదిరీతులనే పోషించునవి యగును.

5. ఆనందవర్ధనుడు ధ్వని కావ్యాత్మ యనెను. వస్త్వలంకార రూప మయిన త్రివిధధ్వని కావ్యమున కాత్మ. వ్యంగ్యమగు నర్థము ముఖ్యముగా నున్నపుడే కావ్యము ధ్వనిసంజ్ఞ కలదగును. గుణాలంకారాదు లన్నియు ధ్వనికంగములు.

6. కుంతకుడు వక్రోక్తిజీవితమన్న గ్రంథమున వక్రోక్తి కావ్య జీవిత మనెను. వక్రోక్తి యనునది భణితిభంగీచిత్రత. ఇది చమత్కృతి ప్రాణము. స్వస్పందసుందర మయిన వక్రోక్తి యున్నపుడే సహృదయులు కావ్యత్వమును నిశ్చయింప గలరు.

7. మహిముడు వ్యక్తివివేకమన్న గ్రంథమున అనుమానమె కావ్య ముఖ్య మని నిశ్చయించెను. ధ్వనివాదమును ఖండించెను. కావ్యము నందలి గమ్యమానార్థ మనుమానముచే గోచరించును. అనుమానమన్నది కార్య కారణ భావము ననుసరించి యుండును. కావ్యము లన్నియు కార్యకారణ సుబద్ధములై యుండును. కావున అనుమానమె కావ్యజీవితము.

8. క్షేమేంద్రుడు ఔచిత్యమె కావ్యజీవిత మనెను. కావ్యము నం దెట్టి రచన కాని యౌచిత్యము విడనాడదు. ఔచిత్యబంధము కావ్య రహస్యము.

ఇట్లెనిమిది వాదములు సాహిత్యసంప్రదాయములందు గోచరించినను రసము, అలంకారము, గుణము, ధ్వని, వక్రోక్తి యను నయిదు వాదములె ముఖ్యము లయినవి. రీతి సంప్రదాయము గుణవాదము నం దంతర్భవించును. అనుమాన సంప్రదాయము ధ్వనిధ్వంసనాత్మక మయిన దగుట వలన వేరుగా పరిగణనీయము కాదు. ఔచిత్యవాదము రససంప్రదాయము నందే యంతర్భవించును.

ఇట్లయిదు సంప్రదాయములు వేరుగా గోచరించినను వక్రోక్తిసంప్ర దాయమును ప్రత్యేకము పరిగణింప వలసిన యవసరము లేదు. అందు కొంత భామహుని అలంకారసంప్రదాయమునకు రూపాంతరము. మరికొంత రూపాంతరమున నున్న ధ్వనిసంప్రదాయము. గుణాలంకార సంప్రదాయ

ములును ధ్వన్యంగములై స్వరూపలాభము పొందును. కావ్యాత్మగా పరిగణింప దగిన ధ్వని యున్నపుడే గుణములు గుణములు, అలంకారములు అలంకారములు నగును. కావున నవియు ధ్వన్యంగములు. ఇక కాగా రససంప్రదాయము ధ్వనిసంప్రదాయము అన్న రెండుమాత్రమె ముఖ్యములై మిగులును. ఇందును రెండింటికి భేదము లేదు. ధ్వనిసంప్రదాయము వస్తుధ్వని, అలంకారధ్వని యని మూడు విధములు, వస్త్వలంకారములు రసపర్యవసానము పొందును. కాగా ధ్వనిసంప్రదాయము నందును రసమె ముఖ్యమని తేలును. స్థూలదృష్టికి సాహిత్యసంప్రదాయము లెనిమిదిగా గోచరించినను రససంప్రదాయ మొక్కటే మూలభూత మని ధ్వనిసంప్రదాయము తద్భాష్యప్రాయమని గ్రహింపవలెను.

## 3. ధ్వనిభేదములు

కావ్యాత్మ ధ్వని. అది యభిధామూలము లక్షణామూలము నగును. మొదటిది వివక్షితాన్యపరవాచ్యధ్వని, ఇది యసంలక్ష్యక్రమధ్వని యని, సంలక్ష్యక్రమధ్వని యని రెండు విధములు. అసంలక్ష్యక్రమము నే రసాది ధ్వని యందురు. సంలక్ష్యక్రమము శబ్దశక్తిమూలము అర్థశక్తిమూలము (ఉభయశక్తిమూలము) నని భేదము పొందును అర్థశక్తిమూలమునకు స్వతస్సిద్ధమని, కవిప్రౌఢోక్తిసిద్ధమని, (కవినిబద్ధవక్తృప్రౌఢోక్తసిద్ధము) భేదములు కలవు. వీనియందు వస్తువు ధ్వనింపవచ్చును. అలంకారము ధ్వనింపవచ్చును. పద–వాక్య–ప్రబంధగతముగా వీనికి భేదము లున్నవి. అవివక్షితవాచ్యధ్వని యను లక్షణామూలకము అర్థాంతర సంక్రమితము, అత్యంత తిరస్కృత మని ద్వివిధము. ఇదియు పదవాక్యగతముగా భేదము పొందును.

## ౪. అసంలక్ష్యక్రమత

రసభావాదులు ధ్వన్యమానములై గోచరించు నపుడు వ్యంజకము లయిన విభావాదులకును, అభివ్యంగ్యము లయిన రసభావాదులకును సూక్ష్మ మయిన క్రమమున్నది. అది సూక్ష్మమగుట గోచరింపదు. ఆ క్రమము సంలక్ష్యమాణము కాదని భావము. కావుననే అసంలక్ష్యక్రమధ్వని యన్న నామము. సంలక్ష్యక్రమధ్వనులలో నీ క్రమము సులక్షమగును. వ్యంజక ప్రతీతికిని వ్యంగ్యప్రతీతికిని కాలభేద మిచట సుగ్రహము.

## ౫. గుణీభూత వ్యంగ్యభేదములు

గుణము అప్రధానము. గుణీభూతము అప్రధానముగా నయినది. ఇది మధ్యమ కావ్యము. గుణీభూతవ్యంగ్య మెనిమిది విధములు. అగూఢము, అపరాంగము, వాచ్యసిద్ధ్యంగము, అస్ఫుటము, సందిగ్ధము, తుల్యప్రాధాన్యము, కాక్వాక్షిప్తము నని యిది యష్టమూర్తి. గూఢముగా నున్న వ్యంగ్యమే చమత్కారి. అగూఢ మతిప్రకాశమగుట చమత్కారి కాదు. ఇట్టిదగూఢ మన్న భేదము. రసము రసాంతరమున కంగ మయినను భావము భావాంతరమున కంగ మయినను రసభావాదు లేవేని యితరాంగ ములుగా నున్నచో నపరాంగ మగును. స్ఫురించిన వ్యంగ్యార్థము వాచ్యార్థ సిద్ధికై యుపకరించునది యగునేని వాచ్యసిద్ధ్యంగ మగును. వ్యంగ్యార్థము స్ఫుటము కాక క్లిష్టకల్పనా సమున్నేయమే యగునేని యస్ఫుట మగును. వ్యంగ్యార్థమే ముఖ్యమా? వాచ్యార్థమే ముఖ్యమా? అదియే రమణీయమా? ఇదియే రమణీయమా? అని వాచ్యవ్యంగ్యముల విషయమై సందేహ ముండునేని సందిగ్ధ మగును. వాచ్యార్థమునకును వ్యంగ్యార్థమునకును ప్రాధాన్యము సమానముగ నున్నచో తుల్యప్రాధాన్య మన్న భేద మగును. కాకు వన్నది స్వరవిశేషము. స్వరముల నూది పలుకుట మొదలగు విశేషములచే గోచరించు వ్యంగ్యార్థము కాకు రూప మయిన యంశమునే పోషించునదై కాక్వాక్షిప్త మన్న గుణీభూత వ్యంగ్య మగును.

## ౬. సంకీర్ణ సంసృష్ట ధ్వనిభేదములు

ధ్వనికి ప్రభేదములతో, గుణీభూతవ్యంగ్యములతో, వాచ్యాలంకార ములతో సంబంధముండ వచ్చును. ఈ సంబంధము సంకరాత్మకము, సంసృష్టి రూపమును. సంకర మనునది ఏకవాచకానుప్రవేశసంకరము, అంగాంగిభావ సంకరము, సందేహసంకరము అని మూడు విధములు. సంసృష్టి ఏకవిధమే. స్వప్రభేదసంకీర్ణము, స్వప్రభేదసంసృష్టము, గుణీభూతవ్యంగ్యసంకీర్ణము, గుణీభూతవ్యంగ్యసంసృష్టము, వాచ్యాలంకారసంకీర్ణము, వాచ్యాలంకార సంసృష్టము, సంసృష్టాలంకారసంకీర్ణము, సంసృష్టాలంకారసంసృష్టము అని బహుభేదభిన్న మగును.

## ౭. రసస్వరూపము

విభావానుభావవ్యభిచారిభావములచే సముల్లాసము పొందిన స్థాయి

భావము రసమగును. లోకమున కామినీ కాముకులకు కలిగిన పరస్పర ప్రేమలో నొకరికొకరు కారణ మగుదురు. ఆ ప్రేమ కార్యములుగా నుండు చేష్టలు కార్యములు. వారి యుత్సాహాదులు సహకారి కారణములు. వానినే కావ్యనాట్యములందు వ్యవహరించు నపుడు కారణములు విభావములని, కార్యము లనుభావములని, సహకారికారణములు వ్యభిచారిభావములని వ్యపదేశము పొందును. ఈ విభావాదులచే స్థాయి సముల్లాసము పొందునేని రసమగును.

రసనిష్పత్తి విషయమై చాల వాదములు కలవు. భట్టలోల్లటుడు శ్రీశంకుకుడు భట్టనాయకుడు వేరువేరుగా రసనిష్పత్తిని నిరూపించిరి. ఆనందవర్ధనధ్వన్యాలోకమునకు లోచన మన్న వ్యాఖ్యానము రచించిన శ్రీమదభినవగుప్తులు రససిద్ధాంతమును ప్రకాశింప జేసిరి. సహృదయసామాజికుల హృదయములందు సంస్కారరూపముగా స్థాయిభావ ముండును. అది నాట్యకావ్యభావనాసమయమున సముల్లాసము పొంది రస మగును. విభావాదు లా సముల్లాసమును సంపాదింతురు. భావనావిశేషమున కారణ కార్యసహకారి కారణములు అలౌకికములై గోచరించును. అపుడు సీతా రామాదులు శకుంతలాదుష్యంతాదులు ప్రేయసీప్రియు లన్న సామాన్య రూపముగా గోచరింతురు. హృదయము నందలి స్థాయిభావమునకు ఆ సమ యమున నావరణభంగము కలుగును. ఆవరణభంగము కలుగగా ఆత్మచైతన్య ముతో కూడిన స్థాయి యాస్వాద్యమాన మగును. అదియె రసము. రసా స్వాదసమయమునందు సత్త్వగుణోద్రేకము వలన ప్రకాశానందరూప మయిన సంవిద్విశ్రాంతి యుండును. శత్రుసంబంధము కాని మిత్రసంబంధము కాని గోచరింపదు. ఇట్టి అభినవగుప్తుల రససిద్ధాంతమునే ఆలంకారికు లందరు నంగీకరించిరి. ఈ రసమునకు సహృదయసామాజికులే యాశ్రయము.

రసములు తొమ్మిది. శృంగారము, కరుణము, హాస్యము, వీరము, రౌద్రము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము అని. క్రమముగా వీని స్థాయిభావములును తొమ్మిది. రతి, శోకము, హాసము, ఉత్సాహము, క్రోధము, భయము, జుగుప్స, విస్మయము, శమము, అని. శృంగార మొక టియే రసము. అన్యములు రసములే కావు. అని భోజదేవుని వాదము. కరుణమే రసమని కొందరనిరి. అద్భుతమే రసమని యొకడనెను. నాట్య రసము లెనిమిదియె యని కొందరి యూహ. వీరు శాంతము రసము కా

దందురు. వాత్సల్యము కూడ రసమని మఱికొంద రందురు. భక్తియు రస మని మఱికొందరి భావము. స్నేహము మాత్రము రసము కాకుండునా? అనికొందరు తలంతురు. భరతముని నిర్ణయప్రకారము శ్రీమదానందవర్ధనాభినవగుప్తుల సిద్ధాంతమును బట్టి రసములుతొమ్మిదియె.

## ౮. రసవిరోధ ప్రదర్శనము

వీరశృంగారములకు, శృంగారహాస్యములకు, వీరాద్భుతములకు, వీర రౌద్రములకు, రౌద్రకరుణములకు, శృంగారాద్భుతములకు పరస్పరము విరోధము లేదు. వీని కంగాంగిభావము నిరూపింప వచ్చును. శృంగారబీభత్సములకు, వీరభయానకములకు, శాంతరౌద్రములకు, శాంతిశృంగారములకు పరస్పరము విరోధ మున్నది, ఈ విరోధపరిహారమునకై సావధానముగా రచయిత సమీక్ష చేయవలయును.

## ౯. రసవదాదులపై ప్రాచీనుల భావము

రసవత్-ప్రేయ-ఊర్జస్వి-సమాహితము భావోదయము భావసంధి భావశబలత యని యలంకారము లేడు కలవు. వీని విషయమున ప్రాచీనుల భావ మిట్లున్నది. ప్రధానముగ గాని అప్రధానముగ గాని రసముల వర్ణించినచో రసవదలంకార మగును. రత్యాదిభావముల ననుభావాదిసూచనములతో గూర్చినచో నది ప్రేయోలంకారము. ఈ రెండును శాస్త్రవిధానమునకు అవిరుద్ధముగా నుండును. శాస్త్రసంవిద్విరుద్ధముగా లోకవ్యవహారవిరుద్ధముగా అనౌచిత్యప్రవృత్తము లయిన భావబంధ మున్నను, రసబంధ మున్నను ఊర్జస్వి యలంకారమగును. అనగా భావాభాస, రసాభాస నిబంధనమున ఊర్జస్వి అలంకార మగునని తాత్పర్యము. రసభావతదాభాసముల వ్యవహారమును ప్రశాంతప్రాయముగ నిబంధించినపుడు సమాహితాలంకార మగును. దీనిలో నితరానుభావముల ప్రసక్తి యుండదు. రసభావతదాభాసములు ప్రశాంతకల్పములై భాసించును. రసాంతరముల స్వరూపము కొంతగా నావిర్భావము పొందినను అది తిరోహిత మగునే కాని యాస్వాద్యమానము కాదు. అందుచే నిట్టి స్థలము లందు సమాహితాలంకారము, భావోదయ నిబంధన మున్నచో భావోదయాలంకారము పరస్పర విరుద్ధము లయిన రెండుభావముల సమావేశము వర్ణించినచో భావసంధి యలంకారము. నానాభావముల సమ్మిశ్రణము వర్ణితమయినచో భావశబ

లత యలంకారము. ఈ యంశమున ఆనందవర్ధనుడు స్వమతము నావిష్కరింప జేయవలసిన యావశ్యకత కలిగినది. రసభావాదులు ప్రధానముగ నే వర్ణితము లయినపుడు ధ్వని వ్యవహారముండునని, అప్రధానముగ వర్ణితము లయినపుడు రసవదాద్యలంకారవ్యవహారము కల్గునని ధ్వనికారుని మతము.

## ౧౦. పంచసంధులు.

రూపకములందు వస్తునాయకరసభేదము ననుసరించి భేదము కలుగును. రూపకవస్తువు క్రమపరిణామము కలదై నిరూపితము కావలయును. అది యట్లగుటకు అయిదు ప్రఘట్టముల యనుసరణ మావశ్యకము. ఆ వస్తు విభాగమే పంచసంధులు. గ్రంథనిరూపితమగు మహాప్రయోజనముతో సంబంధమున్నను అవాంతర ప్రయోజనముతో సంబంధముండుట సంధి యగును. అర్థప్రకృతు లయిదు కలవు. బీజ, బిందు, పతాకా, ప్రకరీ, కార్యము లన్నవి యర్థప్రకృతులు. ఈ ప్రకృతి పంచకమున కవస్థాపంచకముతో యథాసంఖ్యముగా సంబంధ మున్నచో సంధు లుదయించును. ఆరంభ, యత్న, ప్రాప్త్యాశా, నియతాప్తి, ఫలసిద్ధి యనునవి పంచావస్థలు. బీజారంభముల సంబంధమున ముఖసంధి కలుగును. బిందు ప్రయత్న సంబంధమున ప్రతిముఖసంధి కలుగును. పతాకా ప్రాప్త్యాశాసంబంధమున గర్భసంధి కలుగును. ప్రకరీనియతాప్తుల సంబంధమున విమర్శసంధి కలుగును. కార్యఫలసిద్ధుల సంబంధమున నిర్వహణసంధి కలుగును. ఈ యయిదు సంధులకును వేరువేరుగా నంగము లున్నవి. అవి యన్నియు నరువది నాలుగు. వీనిని సంధ్యంగములందురు. సంధిసంధ్యంగములును రసాభివ్యక్త్యనుకూలముగా నిబంధింప వలయునని యానందు డనును.

## ౧౧. దీపకాదులందు వ్యంగ్యగుణీభావము.

దీపకము, సమాసోక్తి, ఆక్షేపము, విశేషోక్తి మొదలగు నలంకారములలో వ్యంగ్యమగు నంశము వాచ్యమునకే శోభాసంధాయకమై గుణీభావము పొందుచున్నది. ఉపమానోపమేయములకు ఏకధర్మసంబంధమును జెప్పుట దీపకాలంకారము. "మదమున కలభమును ప్రతాపమున భూపతియు భాసించె" నన్నది లక్ష్యము. ఇందు భాసించుట యను సమానధర్మము కలభభూపతులకు సంబంధించి యున్నది. కావున దీపకము. దీనిలో భూపతి కలభసమానుడు అను సాదృశ్యము వ్యంగ్యముగ గోచ

రించును. అది యుపమారూపము. కాని యావ్యంగ్యోపమ వాచ్యదీపకము నకె శోభనిచ్చినది. సమాసోక్తిలో చూడుడు! ప్రస్తుతార్థమును జెప్పునపు డప్రస్తుతార్థము గోచరించు నేని సమాసోక్తి యలంకార మగును. సంక్షేపముగా ప్రస్తుతాప్రస్తుతముల కథనము కలదు. కావున సమాసోక్తి. "శశి విలోల తారకమయిన నిశాముఖమును గ్రహించెను. రాగమున జారిన తిమిరాంశుకమును నిశ గుర్తింపనే లేదు." ఈ యుదాహరణములో నిశాశశిగత స్త్రీ పుంలింగస్వారస్యమున కామినీ కాముక ప్రతీతి స్ఫురించును. ఇందు కాముక వ్యవహారము వ్యంగ్యము. అది యుద్దీపన విభావ వర్ణనాత్మక మయిన శశిసముదయార్థము నందే గుణీభావము పొందుచున్నది. ఇట్లే ఇతరాలంకారములందును వ్యంగ్యము వాచ్యశోభా సంపాదకమై గుణీభావమె పొందును.

## ౧౨ రూపకాదులందు సాదృశ్యము

సాదృశ్యమనునది వస్తుద్వయమునకు సంబంధించి యుండును. ఉపమాలంకారమునం దుపమానముతో నుపమేయమునకు సాదృశ్యకథన ముండును. సాదృశ్యగర్భము లయిన సర్వాలంకారములందును స్పష్టముగనో యస్పష్టముగనో సాదృశ్యమె చమత్కారకమై యుండును. ముఖము చంద్రుడన్న రూపకములో, చంద్రుడు ముఖసదృశు డన్న ప్రతీపములో, చంద్రునకు చంద్రుడే సాటి యన్న యనన్వయములో, ముఖము చంద్రసదృశము చంద్రుడు ముఖసదృశుడన్న యుపమేయోపమలో, ముఖము చూచి చంద్రు డనుకొంటి నన్న భ్రాంతిలో, ముఖము చంద్రుడా! యన్న సందేహములో, ముఖము నుజూచి చంద్రుని స్మరించె నన్న స్మరణము మొదలగు వానిలో నంతటను సాదృశ్యముఖమున ప్రతిలంభ మున్నది.

## ౧౩ కుమారసంభవమున పార్వతీదేవి

మహాకవి కాళిదాసు మొదట పార్వతి నిట్లు వర్ణించెను. విధాత సర్వోపమాద్రవ్యసమూహమును తగినట్లుగా వినివేశింపజేసి యొకచో నున్న సౌందర్యమును జూడవలెనని పార్వతిని వర్ణించెను. కాంతిమహతి యయిన దీపశిఖవలె, వియద్గంగానదివలె, సంస్కారవతి వాణివలె ఉమాదేవి యున్నది నవయౌవనమున పార్వతీదేహము చతురశ్రశోభ కలదయినది. పాదములు నేలపై మోపగనే యంగుష్ఠనఖప్రభ లరవిందశోభ నిచ్చినవి.

పార్వతి రాజహంసలకు మంజుగమనము నేర్పినది. శిరీషపుష్పాధిక సౌకుమా ర్యము కలిగిన యామె బాహువులు రమణీయములు. లక్ష్మి చంద్రపద్మము లలో సంపూర్ణప్రీతి పొందలేక ఉమాముఖమున ద్విసంశయప్రీతి పొందినది. ఆమె స్వర మమృతము. భ్రూభంగి ధనురధికసుందరము. చమరీమృగములకు లజ్జ యుండునేని యామె కేశపాశము చూచి వాలప్రియత్వమును విడనాడ వలసినది. ఇట్టి విధముగా మొదట రూపవర్ణనము పరిసమాపనము చేసెను. శివుని శుశ్రూష చేయుచున్న పార్వతి యిట్లు వర్ణిత యయినది. నీలాలకము లందు నవకర్ణికారములనుజారు నట్లుంచి శివునకు పార్వతి నమస్కరించినది. సింధువారపుష్పమాల మెడ ధరించినది. బాలసూర్యారుణ మయిన వస్త్రము ధరించి, కేసరదామకాంచి సర్దుకొనుచు, లీలారవిందము నటునిటు త్రిప్పుచు పార్వతి యేతెంచెను. శివుని హృదయము కదలినది. ఉమాముఖమున దృష్టిసారించినాడు. ఉమాదేవియు నంగభంగిమలచే భావప్రకాశనము చేయుచు ముఖము నటునిటు త్రిప్పి యడ్డముగా తిరిగెను.

కాళిదాసు మరల కళ్యాణసమయమున నిట్లు వర్ణించెను. తూర్పు దిశగా సువాసినులు పార్వతిని కూర్చుండ బెట్టిరి. ధూపము వేసి కేశము లార బెట్టిరి. దూర్వలు కల మధూకదామ ధరింప జేసిరి. మైపూత పట్టించిరి. గోరోచనా పత్రము లిఖించిరి. ముంగురులు సర్దిరి. కపోలమున వ్రేలాడు నటుల యవాంకురమును కర్ణావతంసము చేసిరి. పాదములకు పారాణి నుంచిరి ఆభరణముల పెట్టిరి. అద్దము చూపిరి. తల్లివచ్చి ముఖమెత్తి వివాహదీక్షాతిలక ముంచినది. కౌతుకహస్తసూత్రము కట్టిరి. ఉమ క్షౌమ దుకూలము కట్టినది. కులదేవతలకు నమస్కరించినది. పతివ్రతాపాదగ్రహణ మొనరించినది. పతి ప్రేమలాభము వరముగా పొందినది.

## ౧౮. కుమారసంభవమున హిమవంతుడు

కాళిదాసు హిమవంతుని మొదట స్థావరాత్మకముగా నిట్లు వర్ణిం చెను. ఉత్తరదిశయందు హిమాలయమను నగాధిరాజము కలదు. అది దేవ తాత్మకము. అనంతరత్ననివాసము. హిమ మున్నను దోషాపాదకము కాలేదు. హిమాలయమున గైరికాదిధాతువు లున్నవి దాని శిఖరములు మేఘమండలము దాటి యున్నవి. అందు సింహములు సంచరించును. భూర్జ పత్రములపై ధాతురసములతో నక్షరము లుంచి విద్యాధర సుందరు

లనంగ లేఖలు నిర్మింతురు. కీచకరంధ్రిభాగములు వాయుపూరితములై కిన్న రుల గానమునకు తావ మిచ్చును. గజములు ఘట్టింపగా ప్రసరించిన సరళ ద్రుమరసము చరియలను పరిమళింపజేయును. గుహలలో దివ్వెలుగా వెలుగు మహౌషధులు గలవు. అచట చమరీమృగము లున్నవి. భాగీరథీనది యున్నది సప్తర్షు లచట సంచరింతురు. హిమాలయమునకు శైలాధిపత్య మున్నది.

పిమ్మట జంగమమూర్తిముగా నిట్లు వర్ణించెను. పూజ్యులయిన సప్తర్షు లను పూజించుటకై యర్ఘ్యమందుకొని హిమవాను డెదురేగెను. యథావిధి వారల సత్కరించి యంతఃపురమునకు తీసికొనిపోయి సముచితాసనములందుప వేశింపజేసి యిట్లు పలికెను. "మీదర్శనమున మీ యనుగ్రహమున నేను పవిత్రుడ నయితిని. మీ సంభావనమున నానందము కలిగినది. నా రజ స్తమము లంతరించినవి. నన్ను పవిత్రుని చేయుటకై తా మిచటకు విచ్చేసి తిరి. నేను మేము మీ కింకరులము. ఆజ్ఞాపింపుడు."

## ౧౫. కావ్య ప్రభేదములు

1 ముక్తకము అనిబద్ధకావ్యము. ఏపద్యమున కా పద్యము వేరు వేరుగా నుండును. ఇతరములతో నది సంబంధించదు. స్వయంపూర్ణము. ఇట్టివొకచో నిబద్ధములు కాకున్నపుడే ముక్తకములు. ఒక గ్రంథమున నున్న కొన్ని పద్యము లట్టిలక్షణముతో నున్నను ముక్తకములు కావు. 2. సందాని తకము రెండు రెండు పద్యముల సంబంధముతో నుండును. దీనికి యుగ్మ మనియు పేరు. 3. మూడు పద్యముల కేకాన్వయ మున్నచో విశేషకమని పేరు. 4. కాలాపకమనునది నాలుగు పద్యముల సంబంధము కలదగును. 5. కులకము నాలుగు పద్యముల కధికముగా నెన్నిటితో సంబంధించి యున్నను కులక మగును. వీని కన్నిటికేకాన్వయమె యుండును. సందా నితకము మొదలగు వీనిని కవులు కొందరు నిబద్ధరూపము లయిన సర్గబంధ కావ్యములందే యచటచట గూర్చినారు అవసరాపేక్షతో కూర్పుపొంది ననే రమణీయము లగును. లక్షణ మున్నదని కూర్చినచో సరిగా నతికి యుండవు. 6. పర్యాయబంధము. వసంతవర్ణనము మొదలగునవి యిందుం డును. అవాంతరముగా ననేకక్రియల సంబంధమున్నను ఏకవర్ణనోద్దేశమై యిది యుండవలయును. ఏ రే ఋతువుల వర్ణన మున్నను ముఖ్యాంశ సంబంధము విడిపోరాదు. 7. పరికధ. ధర్మాదిపురుషార్థము లిందు సముద్ది

ష్టము లగును. ఉపపాదన చిత్రత కలిగి నానావృత్తాంతవర్ణనమున దీర్ఘదీర్ఘ సమాసములతో నితివృత్తప్రధానకముగా నుండును. రసబంధాభినివేశ మంత ముఖ్యముకాదు. 8. సకలకథ. సర్వవిధఫలముల స్వాభావసుందరతకల కథానిబంధన ముండవలెను. సామాన్యముగా సకలకథ సంస్కృతభాషాత్మకముగా నుండదు. 9 గ్రంథాంతరములందు ప్రసిద్ధమయిన కథ వర్ణిత మయినచో ఖండకథ యన్న కావ్యభేదము. ఆ కథను మధ్యనుండికాని యుపాంతము నుండి కాని గ్రహింపవచ్చును. కథను ఖండాత్మకముగా గ్రహించినను వర్ణనాచాతుర్యముతో నిది పూర్ణము కావలయును. 10. సర్గబంధము. ఇందన్నియు పద్యములు. దీనిని సర్గలుగా విభాగింతురు. కొందరు శ్వాస విభాగము చేయుదురు. కొందరు ఆశ్వాసములుగా చేయుదురు. నాటకాదులలోవలె దీనియందును ముఖాదిసంధులుండవలెను. ఆశ్వాసక బంధము సంధిబంధము అవస్కంధక బంధము అని యిందవాంతరభాగము లుండవచ్చును. ప్రతిబంధాంతమునను భిన్నవృత్తముండుట సంప్రదాయము. సామాన్యముగా నొకభాగ మొకఛందముననె యుండవలయును. అష్టాదశవర్ణనము లుండుట సామాన్యలక్షణము. ఒకేకథ ఒకే రసము ప్రధానముగా నుండుటయు నితరము లంగముగా నుండుటయు సంప్రదాయము. 11. అభినేయార్థ మనునది దృశ్యకావ్యము. పదిరూపకములు నాటకాదులు, పదునెనిమిది యుపరూపకములు. నాటికాడోంబీ శ్రీగదితాదులు దృశ్యకావ్యములు. 12. ఆఖ్యాయిక గద్యబంధము, పద్యము లుండవు. నాయకుడు తన వృత్తాంతమును ప్రతిపాదించుకొనవలయును. వక్త్రము అపరవక్త్రము అను ఆర్యావృత్తము లిందు నిబద్ధము లగును. అవి భావ్యర్థసూచకము లగును. అవాంతర ప్రకరణపరిసమాప్తి వచ్చినపుడు ఉచ్ఛ్వాసముల విభాగముండును బింకము కలిగిన గద్య యుండుట ముఖ్యము. 13. కథ, ఇదియు గద్యకావ్యము. సర్వము పద్యమయముగా నుండునదియు కథ యగునని కొందరు తలచిరి. అనందవర్ధన సమ్మతమయిన కథ గద్యరూపము. బాణభట్టారకుని కాదంబరీ గ్రంథము కథ. హర్షచరిత మాఖ్యాయిక. ఇంకమ విశేషలక్షణముల నాకరమున జూడదగును.

# ప రి భా ష

శాస్త్రభాషా పదముల కన్న కావ్యభాషా పదములు విలక్షణములు విశిష్టములు, కావ్యనయము ననుసరించిన పారిభాషికపదముల ప్రయోగము రమణీయత నాపాదించును. కొన్ని పారిభాషిక పదముల కిచట వివరణమున్నది.

ధ్వని – ధ్వనింపచేయు శబ్దము, ధ్వననరూపమయిన శబ్దమునందలి వ్యంజనవ్యాపారము, ధ్వనించు నర్థము, అది కల కావ్యమును ధ్వనియని యిందు ప్రయుక్తమయినది. యథానుకూలముగ గ్రహింపవలెను.

భక్తి – ఒక దానిధర్మమును వేరొక వస్తువునందారోపించుట. చంద్రధర్మమును ముఖమందారోపించి చంద్రుడని చెప్పుట. ఇదియె లక్షణ కాని కొంతభేదమున్నది. భక్తిలో సాదృశ్య సంబంధముండును. లక్షణలో నితర సంబంధములుండును. అందుచే నిది లక్షణాభేదము.

లక్షణ – వాచ్యార్థము కుదురక పోగా నాకుదురుబాటు సూచించు శబ్దవ్యాపారము. లక్ష్యార్థమును చెప్పగల లక్షక శబ్దమునందలి శక్తి లక్షణ.

సహృదయుడు – సచేతస్కుడు భావకుడు సామాజికుడు సహృదయుడు పర్యాయములుగా నిందు ప్రయుక్తము లయినవి. కావ్యార్థభావనా విశేషమున విశదమయిన మనోముకురము కలవాడు. నానావిధములయిన చిరంతన సంస్కారములు సమకాల సంస్కృతులు కల వ్యక్తి. సత్వప్రకాశముకల యంతరంగముకల వ్యక్తి: సహృదయుడె కావ్యాధికారి. సహృదయత్వము జన్మాంతర విశేషముల వలన కలుగు నొక రమణీయ ధర్మము.

వాచకము – కావ్యశబ్దములు వాచకములు లక్షకములు వ్యంజకములు నని మూడు విధములు. సంకేతితమయిన యర్థమును జెప్పునది వాచకము. వాచక శబ్దశక్తికి అభిధ యని పేరు. దీనిచే గోచరించు నర్థము వాచ్యము. వాచ్యార్థమున కుపపత్తిని సాధించు నన్యార్థము లక్ష్యము. లక్ష్యము చెప్పునది లక్షకము. వాచ్యార్థ ముపపన్నమయినను ప్రతిభాసించు నర్థము ప్రతీయమానము. ఇది వ్యంగ్యము. దీని వ్యంజకశబ్దము చెప్పును. ఇందు వ్యాపారము వ్యంజన.

అలంకారము – స్వాతిరిక్తమగు నంశము నలంకరించునది. అలంకార్యము నలంకరించునది. శబ్దాశ్రయముగా నర్థాశ్రయముగా నలంకారముండును.

విభావము – విశేషముగా భావింపబడునది, భావింపజేయునది. ఇది రసహేతువు. ఆలంబనము ఉద్దీపనము నని విభావభేదములు. అనుభావము– స్థాయిభావముననుసరించి భావింపబడునది, అనుభవింపజేయునది మనోభావము సూచించు నానాచేష్ట లనుభావములు. వ్యభిచారులు – విశేషముగా నంతట సంచరించునవి. స్థాయిభావము ననుభవపథము నందు చక్కగా ప్రసరింపజేయునవి. ఇవి ముప్పదిమూడు. తరంగములు సముద్రమునందు పుట్టును నశించును. అయినను శోభనాసాదించును. అట్లే నిర్వేదాదివ్యభిచారులు పుట్టును. నశించును. రసమునకు శోభనిచ్చును. సాత్త్వికభావములు – సత్వమువలన గలుగునవి. పరుల సుఖదుఃఖాదులను భావించినపుడు అంతఃకరణమునకు గలుగు భావనావివేకము సత్వమగును. సాత్త్వికములు ఎనిమిది. కంపము స్వేదము రోమాంచము మొదలగునవి. స్థాయిభావము– స్థిరముగా నుండు భావము. సజాతీయములచేగాని విజాతీయములచేగాని తిరస్కృతము కానిది. రతిహాసాదులు స్థాయిభావములు తొమ్మిది.

మాధుర్యము – కావ్యగుణములలో నిది యొకటి. శాంతశృంగార కరుణముల కిది యనుకూలము. మృదుల వర్ణబంధము, సమాసములులేని రచనయుండును. ఈగుణమున్న కావ్యభావనమున హృదయమునందార్ద్రత కలుగును. ఓజస్సు – కావ్యగుణము. దీర్ఘ సమాసరచనయుండును. భావనమున మనసునకు దీప్తికలుగును. ప్రసాదము – కావ్యగుణము, శబ్దార్థముల స్వచ్ఛత యుండుండును.

శ్రుతిదుష్టము – కావ్యదోషము. శ్రవణపరుషములయిన వర్ణము లుండుట. శృంగారవర్ణనమున కొన్నివర్ణములు తగవు. సంయుక్తాక్షరము లుండరాదు. అట్టి వుండుటదోషము.

ప్రతిపత్త్రృవిశేషము – సహృదయవిశేషము, యమకము – శబ్దాలంకారము, స్వరవ్యంజనములకు ఆవృత్తియుండుట. అపృథగ్యత్ననిర్వర్త్యము. వేరొక ప్రయత్నముచే నిర్వర్తింపబడనిది. శరీరీకరణము – శరీరతాసంపాదనము. విచ్ఛిత్తి – చమత్కారము.

ఏకాధికరణ్యము – ఏకాధికరణత్వము, ఒకే యాధారముండుట.
నైరంతర్యవిరోధి – నిర్ అంతర – నిరంతర, వ్యవధానము లేకుండుట. దాన
గలిగిన విరోధము. శృంగారశాంతములు నిరంతరముగా (వ్యవధానము)
లేకుండగా కూర్పుపొందుట తగదు. ఏకాశ్రయవిరోధి – ఒకటే యాశ్ర
యముగానున్నందున గలుగు విరోధము.

ఉపనాగరిక – శబ్దవృత్తులలో నొకటి. ఉపనాగరిక గ్రామ్య లలిత
పరుష యను పేరులు ప్రాచీనములు. తరువాతి కాలమున కైశిక్యాదినామ
ములు కలిగినవి.

స్వాలక్షణ్యము – స్వరూపము. బౌద్ధవాఙ్మయమున నీపదప్రయోగ
మధికముగా నున్నది. విశ్వమున నేపదార్థమునకును లక్షణనిర్వచనము
శక్యముకాదు. పదార్థసామాన్యమంతయు స్వగతవిశేషముననే యుండును.
అదియే స్వాలక్షణ్యము.

సంవాదము – అన్యసాదృశ్యము. హృదయసంవాదము – ఒకరు
నిరూపించిన భావము తనకును పరిగ్రాహ్యమై స్పందమొదవించినచో
నాభావముతో తనకు హృదయసంవాదము కలుగును. ప్రతిభ – నవనవార్థ
ములను నిర్భరముగా గలుగజేయు నొకానొక శక్తి.

*

"స్వస్పంద ప్రథమాన భావమహతీం సంవాదసారాం పరాం
పశ్యంతీ మనురూపసర్గకలనాం సంవిత్ప్రదాం మధ్యమాం
విశ్వాకాశవిహారిణీం రసమయీం దేవీం కలాం వైఖరీం
విశ్వోత్తీర్ణవిభామహార్ణమధురాం షట్ప్రజ్ఞసారాం భజే."